

# వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ

## కథలూ రచనలు

**28-10-24 TO 29-11-24**

 

10. మీకు తెలీని వూరిలో నేనున్నాను **29 -11 -24**

ఇది ఏవూరో - నేను ఏ వూరిని గురించి మాట్లాడుతునానో మీకు తెలీదు . మీకు తెలీని వూరిలో మా చెల్లెలుతో మాట్లాడుతూ " చెల్లే .. ఇపుడు 11 గంటలు అవుతోంది .బావగారు ఇంకా ఇంటికి రాలేదు. అయన రాలే దేమీ ? అని మీరెవరూ ఆందోళన పడటం లేదు .మీరెవరూ కంగారు పడటం లేదు ఏమిటి సంగతి ?" అని అడిగాను .

" అన్నయ్యా - రాత్రిళ్ళు ఎనిమిది లోపల అయన ఇంటికి రాలేదు అంటే ఆయన సురాపానం చేయటానికి బార్ కి వెళ్లి వుంటారు . కాక పోతే మా ఊరి బార్ల వద్ద ఓ పద్ధతి అమలులో ఉంటుంది . అందువల్ల నే కంగారు పడటం లేదు " అన్నది మా చెల్లెలు .

నేను వివరం అడిగిన మీద మా చెల్లే ఇట్లా చెప్పింది " ఈ వూళ్ళో 500 రూపాయల ఆటోలు అని ,కొన్ని స్పెషల్ ఆటోలు బార్లముందు ఉంటాయి . ఆ ఆటోల వాళ్ళు- -- తప్పతాగి రోడ్డు మీద పడి దొర్లే వారిని - రెండు గంటలకు మించి బారులోనే కూచునుండి పోయే వారి ని ప్రత్యేకశ్రద్ధ తో చూసుకొని తమ ఆటోల్లో ఎక్కించుకొని మన ఇళ్లలో డ్రాప్ చేసి పోతారు . ఆటోలు సీరియల్ నెంబర్లో

పెట్టుకుని ఒక్కో ఆటో వాడు ఒక్కొక్కరిని మాత్రమే ఎక్కించుకుంటాడు . అందువల్ల అర్ధరాత్రి 12  దాటే వరకూ ఈ ఆటో వాళ్ళు ఆ బార్ల దెగ్గరే వుంటారు . ఆటో ఎక్కినాయన స్పృహలో లేక ఇంటి అడ్రెస్స్ చెప్పలేక  పోతే  - ఆటోలో ఉన్న మనిషిని తోటి ఆటో డ్రైవర్లతో గుర్తు పట్టించి , తమ పాసెంజర్ యొక్క  ఇల్లు ఎక్కడుందో తెలుసు కుంటారు . లేదంటే ఆ మనిషిని సందు గొందుల్లో తిప్పుతూ ఎలాగో ఒక లాగా ఎవరో  ఒకరితో గుర్తు పట్టించి తెల్లరూ ఘాము కైనా సరే ఇంటికి చేరుస్తారు . ఎటు వంటి స్థితిలో కూడా పోలీసు స్టేషన్ కి తీసుకెళ్లరు .అయన ఫోను లోనుండి మాకు  ఫోన్లు చేయరు మేము డిస్టర్బ్ అవుతామని  . ఇది వారి నైతిక నియమావళి. ఇక ఎంత కష్ట మన్నా కానీ -  ఎంత శ్రమ అన్నా కానీ  మన తాగుబోతు మనిషిని మనఇంటికి చేర్చుతారు . వారి సేవకు అదనపు డిమాండ్లు ఏమీ చేయరు . బేరసారాలేమీ వుండవు . వాళ్లకు  ఓ ఐదు వందలు ఇస్తే చాలు వెళ్ళిపోతారు . చటుక్కున డబ్బులు లేక పోతే ఆ ఐదొందలూ మనపేరున అప్పుగా రాసుకుంటారు కూడా  " అంటూ  ఎంతో విపులంగా చెప్పి టీవీ ముందు కూచుంది .

ఇంతలో డోర్ కాలింగ్ బెల్ మోగింది . మా బావ ఆ ఐదు వందల ఆటోలో పడుకొని వున్నాడు . నేను ఆటో ఆయనికి-   ఐదొందలు ఇస్తే ఆటో వాడు నాకు నమస్తే చెప్పి మా బావను ఇంట్లోకి నెట్టి వెళ్లి పోయాడు ." ఇదే మన హైద్రాబాద్ అయితేనా మూడు వేలు అడిగే వాడు " అని నేను మా చెల్లి మా బావా అనుకున్నాము తెల్లరినాక . దీన్ని బట్టి ఇది హైదరాబాద్ కాదని మీకు తెలిసే పోయింది . మరి ఇక ఇది ఏ వూరో మీరే  ఊహించుకోవాలి . అందువల్ల నే నేను మీకు తెలీని వూరిలో  వున్నాను అని అన్నాను .

ఈ కథ కు "500  రూపాయల ఆటో" అని పేరు పెట్టి కొంత దూరం నడుపుకొచ్చాను,   కానీ కిక్కు కోసం చివరి క్షణములో ఆ పేరును ఫిరాయించేసాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ .

9.చేతకాని వాళ్లకూ కోటి దణ్ణాలు ..     **28-11-24**

మావూరు అమరావతికి దగ్గరలో లామ్ ఫామ్ అని ఒకటుంది . అక్కడ నూతన వరి వంగడాలను సృష్టిస్తారు .ఇదే మోస్తరులో ఎక్కడో ఒక చోట టమోటాలో నూతన వంగడాలను-- అంటే హై బ్రీడ్ టమోటాలను సృష్టించే ఫామ్ ఒకటి ఉంటే అందులో మావాడొకడు పనిచేస్తూ వున్నాడు .అప్పటికి ఓ దశాబ్ద కాలంగా ఈ హై బ్రీడ్ టమోటాలను సృష్టించే పని నడుస్తూ ఉంటే - ఆ పని మూలకంగా ఎర్రని రంగు - గట్టి కండ - ఎంతదూరమైనా ఎగుమతి చేయటానికి వీలుగా రాతి వంటి గట్టితనం - అట్లా గాలిలో పడేస్తే ఏమీ కుళ్ళిపోని తత్వము కల టమోటాలు మార్కెట్ లోకి వచ్చాయి . వీటికి రుచి తప్ప అన్నీ వున్నాయి అని గ్రహించిన జనం - ఈ టమోటాలు మాకు వద్దు - మాకు నాటు టమోటాలే కావాలి , అని అడిగి ఒక ఫది రూపాయలు ఎక్కువిచ్చయినా నాటు టమోటాలే కొనసాగారు . కానీ హై బ్రీడు మోటాలు కని పెట్టిన వారికి ఇది ఎంత తలఒంపులో ఎంతకష్టమో ఎంత నష్టమో ఎవరూ పట్టించుకోలేదు .

బాగా నష్టము కష్టము తలఒంపులు తాళింపులు ఫీల్ అయిన మా వాడు పనిచేసే ఫామ్ మేనేజర్ " టమోటా ఆకారాన్ని బట్టి ఏది నాటో ?ఏది హై బ్రీడో : అనేది జనం యిట్టె పసి కట్టేస్తున్నారు . అందువలన మీరు హై బ్రీడు మోటాలను కూడా నాటు రకం టమోటాల ఆకారంలోకి మార్చండి.మనకు శని వదిలి పోతుంది" అని హుకుం వేసాడు .

మావాడు, మావాడి లాంటి మరో వందమంది మరో దశాబ్దం పాటు కస్టపడి కూడా అలాంటి టమోటాని కని పెట్టటంలో చేతకాని వాళ్ళు అయ్యారు ."చాతకాని వాళ్ళతో మాకెందుకు" అంటూ ఆ ఫామ్ ని మూసి వేయగా వుద్యోగం పోయిందని ఏడ్చుకుంటూ మా వాడు ఇంటికొచ్చాడు .

అప్పుడు నేను " అరే అబ్బాయి ఏమీ చేయక పోవటం కూడా మంచిదే అయ్యింది అని అదేదో ప్రకటనలో చెప్పినట్లు - నీచేతకాని తనం కూడా నీ మంచికే . ఎట్లాగంటే నీ చేతగాని తనం వల్ల జనం ఇప్పటికీ కూడా నాటు టమోటో ఎదో గుర్తుపట్టడానికి ఇంకా వీలుగా ఉంటూ వున్నది . నాటు టమోటో రుచి తో వున్నా పప్పు, పచ్చడి బ్రహ్మానందం తో తినే ప్రతి ఒక్కరూ - నీ చేతకాని తనానికి ఓ దణ్ణం పెట్టుకొని మరీ ఓ ముద్ద నోట్లో పెట్టుకుంటూ వున్నాడని అనుకో . ఇట్లా నీ

చేతగాని తనానికి గానూ నీకు నిత్యా కోటి దణ్ణాలు దొరుకుతూ ఉండి ఉండవచ్చును . మరి నువ్వెందుకు దుఖః పడుతున్నావు ? .జరిగినదానికి సంతోషించు అని హిత భోదాచేసాను . వాడు ఫక్కున నవ్వాడు . అంటే తన చేతకాని తనానికి సంతోషించాడనే కదా.?

మా వాడికే కాదు - చేతగాని వాళ్లందరికీ కూడా మనం దణ్ణాలు పెట్టాలి . బ్యాంకును బురిడీ కొట్టించటం తెలీని పరిశ్రమల వారికీ - స్మశాన భూములు అమ్మటం చేతగాని రియల్ ఎస్టేట్ వారికీ - కోట్లు మింగటం చేత కానీ రాజకీయ నాయకులకు మనం నిత్యా కోటి దణ్ణాలు పెట్టాల్సిందే . ఈ చేతగాని వారి వల్లనే మనము కొంతైనా శాంతిగా ఉంటున్నాము . అందువల్ల చేతకాని వారికీ కోటి దణ్ణాలు అనుకుందాము .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ .

ఈ కథ రాసి ఓ నిద్ర తీసాను . నిద్రలో వచ్చిన ఓ కలలోకి మా చెల్లెమ్మ వంటి ఓ స్త్రీ మూర్తి దూసుకు వచ్చింది ." భర్త మాటలకు ఎదురు చెప్పటం చేతకాని నాలాంటి వారు ఎందరో వున్నారు . వారికి కూడా దణ్ణాలు పెట్టించు" అని కోరింది . ఆమె అట్లా పక్కకు తొలగగానే ఆమె వెనుకనే వచ్చి మా తలుపు మాటున దాక్కున్నా మా బావ బయటికి వచ్చి " భర్త మాటకు ఎదురు చెప్పటం తప్ప మరేదీ చేయటం చేతగాని స్త్రీలు వున్నారు . వారికి కూడా దణ్ణాలు పెట్టించు అని డిమాండ్ చేసాడు . ఎప్పటి కాలానివో అయినా కాన్వెంట్ డ్రెస్సులు స్కూల్ బ్యాగ్లు వేసుకొని మా పిల్లలు కూడా వచ్చారు . "మామిడి పిందెలు చెట్లపై నుండి రాలి పడటాన్ని ఆపటం చేతకాని వాళ్ళు ఉన్నందున - మేము స్కూల్ దెగ్గిర మామిడి పిందెల ముక్కలు కొనుక్కొని అందులో ఉప్పు అద్దుకొని తింటూ వున్నాము - ఈ రకం చేతగాని వాళ్లకు కూడా దణ్ణాలు పెట్టించు అని వాళ్ళు అడిగారు . వాళ్ళ తెలివిని మనం మెచ్చాల్సిందే .

" ఎరా బాగున్నారా ?" అంటూ వాళ్ళ తాతయ్య వచ్చాడు . ఆయనకు అయన కోడలికి ఇష్ట మైన చిన్ని చింతకాయల పచ్చడి చేయుంచుకందామని అయన ఓ సేరెడు బేబీ చింతకాయలు తెచ్చాడు . "చింత కాయలకు హై బ్రీడ్ కాయలు

సృష్టించటం చేత కానీ వారు వున్నారు కాబట్టి - ఇంగువ తిరుగమోత వేసిన చింతకాయ పచ్చడి ని నా చిన్నప్పటి రుచితో ఇప్పటికీ తినగలుగుతున్నాను . ఇది 'చేతగాని  వారికి నా శత కోటి దణ్ణాలు" అన్నాడు .
చూడబోతే చేతగాని వారు అన్ని అంటే ఎన్నో రంగాల్లో ఉండి  వుంటారు . ఎందరున్నారో అందరికీ వందనాలు .

# **8.**పూరీ.. బ్రాహ్మడు **25-11-2018**



ఈ కథను **25 -11 -2018**  న పోస్టు చేసావు . దీనికి ఇప్పుడు ఆరేళ్ళు నిండినవి . మరల తిరిగి పోస్ట్ చేసి మీ స్నేహితులతో పంచుకుంటావా **?** అని ఫేస్ బుక్ వారు వారంతట వారుగా అడిగారు .
నేను షుమారుగా ఏడూ ఎనిమిది ఎండ్లాగా ఫేస్ బుక్ లో ఎదో ఒకటి రాయటం నా వ్యాపకంగా పెట్టుకున్నాను . ఆరేళ్లకు మించి అని ఫేస్ బుక్ వారే అన్నారు .
ఆ నాటి నా ఆలోచన ధోరణికి ఈ కథ ఓ ఉదాహరణ . నేను చిన్న తనములో బ్రాహ్మలు కాని నా ఫ్రెండ్ వారి ఇంటికి వెళ్లి ఒక రాత్రి ఆతిధ్యం స్వీకరించాను . నేను బ్రాహ్మడిని అనగానే వారు చూపిన మర్యాదను గుర్తు చేసుకుంటూ ఈ కథ రాసాను

ఒక కల ఇలా మొదలైంది ..

1) నేను 18 ఏళ్ళ ప్రాయంలో ఉన్నట్లు , అప్పుడు నేను NSS వాలెంటీర్ గా ఉన్నట్లు మొదటి దృశ్యం.

( NSS అనేది కాలేజీల్లో ఉండేది . NSS గ్రూపుని లెక్చరర్లు పల్లెటూళ్ళకి తీసుకెళ్లి , అక్కడ రోడ్లు ఊడి పించి , మురికి కాల్వలు శుభ్రం చేయించి , ఫోటోలు తీయించి కాలేజ్ మాగజైన్లో వేసేవారు ..ఇప్పటి స్వచ్ భారత్ లాంటిది.)

2) మా గ్రూపు లోని ఒక అబ్బాయిది బాగా పల్లెటూరు . ఆ వూరు ఎక్కడో అరణ్యం మధ్యలో వున్నట్లుటుంది. అబ్బయి వాళ్ళ నాన్న పెద్ద మోతుబరి రైతు . వంద ఎకరాల మాగాణికీ ఆసామీ . ఆవూరు వెళ్ళాం రోడ్లు ఊడవటానికి .

3 ) వెళ్లిన సాయంత్రం కొన్ని రోడ్లు చిమ్మి మర్నాడు కొన్ని చిమ్మాలని మా లెక్చరు అన్నాడు .మేము మా ఫ్రెండ్ ఇంట్లోనే బస చేసాం.మొరనాడు ఉదయం చూసే టప్పటికి , రోడ్లన్నీ శుభ్రంగా అద్దాలలాగా వున్నాయి .

4) " మీరు మల మూత్రాలు విసరజించిన రోడ్లు మా పిల్లగాడు వాడి దోస్తులు చిమ్మటం ఏంటిరా ? రేపు ఉదయం మీరే రోడ్లు చిమ్ముకుని అద్దాల లాగా ఔపడేలా చేయాలా . లేకపోతే డొక్కలు పగులతవి " అని మా ఫ్రెండ్ గాడి తండ్రి అందరికీ వార్నింగులు ఇచ్చాడు .. దాని ఫలితమే రోడ్లు అద్దాలు అవటం.

5) చేసే పనిలేక శుభ్రంగా స్నానాలు చేసి టిఫిన్స్ కి టేబుల్ ముందు కూర్చున్నాము . అందరికీ పూరీలు , కూర ,ప్లేట్లలో పెట్టారు. మేము ప్లేట్లలో చేతులు పెట్ట బోతుండగా .. వాకిట్లో కోడి రెక్కల చప్పుడు .. వాటి కొక్కురకో .. లు వినపడ్డాయి .. మా వాళ్ళందరూ బయటికి పరిగెత్తారు .. మధ్యాన్నం తిన పోయే చికెన్ ని, బ్రతికి ఉండగా చూసి సంతోషిద్దామని . వాళ్ళకోసం అని నేను వెయిట్ చేస్తున్నాను .

6) ఇంట్లో నుండి ఒక చిన్న పాప తొంగి చూసి .. నా పక్కకి వచ్చి నిలబడింది .. " పూరీ తింటావా తల్లీ అని ఆ పాపని ముద్దు చేస్తూ పూరీ .. కూరా ఆపిల్ల నోటికి అందించాను . ఆపిల్ల అలాగా రెండు పూరీలు తినేసింది.

7) ఇంట్లోనుండి పిల్ల తల్లి , ఆమె అత్తగారు , నా ఎదరకు వచ్చి నమస్కారం పెట్టి " మీరు బ్రహ్మలా ?అనడిగారు వినయంగా . అవును అన్నాను .

8 ) అత్తా, కోడలు ఇట్లా చెప్పారు " పిల్లకి దెగ్గిర దెగ్గిర 4 years వచ్చాయి . ఇంతవరుకు పాలు తప్ప మరొకటి తీసుకోలేదు . ఏమిపెట్టినా మూతి బిగించేస్తుంది. ఇవాళ బ్రాహ్మణా దేవతల చేతులమీదుగా మొదటి సారి ఆహారం తిన్నది .. దీని పుట్టుక గొప్పది .. పిల్ల మామూలుది కాదు దేవతాంశ .. అనుకుంటూనే వున్నాం .. ( ఎప్పుడూ పాలే త్రాగుతూ ఉండటం వల్ల కాబోలు ) బ్రాహ్మల చేతుల మీదగా మొదటి నైవేద్యం అందుకొని .. దాని మహిమ చూపించింది ..అని ఏమేమో చెప్పింది .. పలుసార్లు నమస్కారాలు పెట్టింది . పని మనిషిని పిలిచి టిఫిన్ ప్లేట్ లన్ని తీసి బయట కి పంపించింది .

9 మరో పది నిమిషాలకి మా ఫ్రెండ్ పరిగెత్తుకొచ్చి " మా వదిన కి నీ మీద భక్తి కుదిరిందిరా . నీకోసం నేతి పూరీలు చేస్తోంది .. నువ్వు తిన్నాక మాకు టిఫన్లట .. పై పెచ్చు .. ఇవాళ చికెన్ బ్యాన్ చేసింది .. కోళ్ళకి లైఫ్ ఎక్స్టెండూ అయ్యింది " అన్నాడు .

10) కాసేపటికి ఇంటి కోడలు వచ్చి " దొడ్లోకి దయచేయండి .. మళ్ళీ స్నానం చేద్దురు అన్నది . స్నానం చేసాను .పంచె ఇచ్చి కట్టుకోండి అన్నది . ఎదో లాగ పంచ కట్టాను .

11) ఇటు తిరిగి చూసే టప్పటికి .. ఓ ఆవు నిలబడి వుంది . దాని నాలుగు కాలి గిట్టల కిందా నాలుగు పెద్ద పెద్ద ఇత్తడి ప్లేట్లు వున్నాయి. అందులో నీళ్లు పోసి పసుపూ కుంకుమ చల్లి వున్నాయి. అలాంటి ఒక ప్లేటులో

నన్ను నిలపెట్టారు. ఇంకో ప్లేటులో కోడలు నుంచుంది . ఆమె చక్కగా స్నానం చేసి పద్దతిగా వుంది. ఏమిటిదంతాను ? అన్నాను .

12) " బ్రాహ్మణా దేవత పూజ చేసుకుంటున్నామండీ .. ప్లేట్ లోని నీరు గంగ .. నేను గంగ లో నిలబడి , గంగలో నిలబడ్డ బ్రాహ్మడికి , గంగా సాక్షిగా , పాడి అవును దానం చేస్తున్నాను " అంది.

కల ఇంతటితో ముగిసింది ..ఎంతో ఆనందం వేసింది ఆకోడలు నన్ను అంతగా గౌరవించి నందుకు .

---------------------------------------------------------------

కలా, కలా ఎందుకిట్లా వచ్చావు అని అడిగాను .

అది ఇట్లా చెప్పింది " బ్రహ్మణులు - అందరు తమని గౌరవించాలని కోరు కంటూ వుంటారు . నీకూ గౌరవం కావాలనిపించింది .. అందుకే ఆ కల వచ్చింది "

"బ్రాహ్మలు గౌరవం , మర్యాద లు కోరుకోవటం ఏమన్నా తప్పా ?

" తప్పేమి లేదు .. సృష్టి నియమము అట్లా వుంది.. శ్రీ రాముడు ఆసనం దిగివచ్చి .. మునులను స్వాగతిస్తాడు. రావణుడు బ్రాహ్మడు, అతన్ని చంపి పాపం చేసానని - రాముడు భాద పడినట్లు ఒక రామాయణం అంటుంది . బలి చక్ర వర్తి .. బ్రాహ్మల్ని కాదన కూడదని కాలు నెత్తిన పెట్టించు కున్నాడు .. శ్రీ కృష్ణుడు కుచేలుడనే బ్రాహ్మణుని ఆదరించి పాద పూజ చేసాడు.అనేక మంది రాజులు , రాణులు బ్రాహ్మలని పూజించి అగ్రహారాలు రాసిచ్చారు . బ్రాహ్మల్ని గౌర వింప వలసింది అని , భగవంతుని ఆజ్ఞ వున్నది - లేక పోతే ఇలాంటివి అన్నీ ఎందుకు జరుగుతవి ?"

" ఐతే బ్రాహ్మలు గౌరవం , మర్యాద లు కోరుకోవటం తప్పులేదా ?

" జ్ఞ్యాన ,  మోక్ష , లోక కల్యాణ సిత్యర్థం బిక్షామ్  దేహి మమ సర్వదా " అని అమ్మవారిని వేడుకున్నంత కాలం -- బ్రాహ్మలు గౌరవ మర్యాదలకు హక్కు దారులే "

ఎవరు చెప్పారు .. కలయా  ? కలలకు అది దేవత ఐన   కాత్యాయనీ .. దేవియా ?

**7.**చైనా పెళ్లి కూతురు . 23 -11 -24  cpkrk1

ఇది క్రీశ -    634, లో నిజంగా జరిగిన చారిత్రిక  కథ . ఇందులో ప్రజల కల్పన కూడా కొంత ఉంటుంది . సరాదాగా చదువు కోవటం కోసం నా సొంత మాట్లల్లో చెపుతాను.

టిబెట్ లో  ఓ రాజు గారున్నారు -   పేరు  సొంగ్తసేం  గాంపో . {Songtsen Gampo } ఈయన తన మనుషులను ఆ రోజుల్లో చైనాను ఏలుతున్న టాంగ్ వంశపు రాజు వద్దకు పంపాడు . టాంగ్ అనేది రాజవంశపు పేరే కానీ రాజు గారి  పేరుకాదు . గాంపో రాజు గారి  యొక్క ప్రతినిధులు చైనా కి  -  అందులో టాంగ్   యొక్క రాజ్యానికి ముఖ్య పట్టణమైన   లువోయంగ్ కి వెళ్లారు .టిబెట్ రాజుగారు తన మనుషులను చైనాకి పంపిన కారణం -- ఏమిటంటే చైనా రాజు గారు ఈ పాటికే   టుర్క్స్ మరియూ  Tuyuhun  అనే జాతి వారితో వివాహ సంభంధాలు కలుపుకున్నాడు .అప్పుడు టిబెట్ రాజు గాంపో " ఆ చైనా రాజు నాతో కూడా వివాహ సంభంధాలు పెట్టు కోక పోవటానికి - ఆ ఇద్దరి కన్నా నేనేమి తక్కువ ? అని తనలో తాను ఫీల్ అయి - నాతో తనతో కూడా ఏదన్నా వివాహ బంధం పెట్టుకుంటా   డెమో కనుక్కు రమ్మని తన

మనుషులను చైనా పంపాడు . ఇంతా చేస్తే ఇప్పుడు గంపా వయసు 13 ఏండ్లే. తండ్రి చని పోయినందున రాజు అయ్యాడు .

{ పైన చెప్పుకున్న - టర్క్ లు అంటే చైనా ప్రజలలోని ఓ తెగ ప్రజలు . ఇండియా లో కూడా టర్క్ లు వున్నారు - ఎన్నడో టర్కీ దేశము నుండి వలస వచ్చి భారత దేశములో స్థిరపడిన వారు తమను తాము టర్కీ లము అని చెప్పుకుంటారు .వీరు భారతదేశములో 1711 మంది వున్నారని జనాభా లెక్కలు చెపుతాయి . చైనా మరియూ ఇండియా టర్కీలు ఇద్దరూ ఒక్కటి కాదు } { ఇహ టూయుహుం/టూయుహుం లు అంటే చైనాలోని ఒక సంచార జాతి . వీరు చైనా లో తమ సొంత సామ్రాజ్యాన్ని ఏర్పరుచు కున్నారు } . చైనా రాజు టాంగ్ గారు టిబెట్ రాజు గంపా గారి కోర్కెను తోసిపుచ్చాడు .పిల్ల బచ్చా గంపా ని లెక్కచేసేది ఏమిటి అన్నాడు . టిబెట్ రాజుగారి మనుషులు వెనక్కి తిరిగి వచ్చి - ఇవే మాటలు తమ రాజుతో చెపితే ఏమవుతుందో అనే భయంతో " చైనా రాజుగారు ముందు సరే అన్నాడు కానండీ - ఆ తరువాత Tuyuhun టూయుహుం జాతి వారి సలహాలు- సూచనల మేరకు కాదు పొమ్మన్నాడు" అని వక్రీకరించి చెప్పారు . దీనితో టిబెట్ రాజు గోమ్పా గారు నేరుగా వెళ్లి Tuyuhun, ల రాజ్యం మీద దాడి చేసాడు - వాళ్ళు తన పెళ్లి చెడకొట్టారని నమ్మి . దాడి చేసి " మీ రాకుమార్తెను నాకు ఇచ్చి పెండ్లి చేయండి లేదా నా సేనల చేతిలో చావండి" అని వాళ్ళతో కూడా బేరం పెట్టాడు . Tuyuhun లు లొంగి రాలేదు . Tuyuhun ల తో వివాహ సంభందం కలుపుకొని ఉన్న చైనా రాజగారు వారికి మద్దత్తు గా తన సేనలను తీసుకొని బయలు దేరి వచ్చాడు. ఈ సమయం లోపు అంటే క్రీశ 634 నుండీ 638 మధ్యకాలం నాటికి టిబెటియను రాజు గోమ్పా గారు -- టూయుహుంల రాజ్యములోని రొండు వంతుల భూభాగాన్ని గెలుచుకున్నాడు . చైనా రాజు టాంగ్ సేనలతో వస్తూ వున్నాడు అనగానే ఈ గంపా రాజుగారు వెనక్కి మరలి వెళ్లి పోయాడు .

ఇద్దరి మధ్యా యుద్ధము ఏదీ జరగలేదు కానీ - ఇరువురూ మేము గెలిచాము అంటే మేము గెలిచాము అని చెప్పుకున్నారు .
గంపా రాజు గారు పట్టు విడవకుండా  తిరిగి  మరొక్క సారి తన వివాహ సంభంద ప్రతి పాదనలను చైనా రాజు  టాంగ్  గారి ముందు కి పంపాడు  . ఆపై ఇదే క్రీశ  638, లో  టాంగ్  మరియూ  టూయుహుం లకు చెందిన ప్రతినిధులు  టిబెట్ కి వచ్చారు .  వారు మాకు బహుమానాలు ఇవ్వటానికి వచ్చారని టిబెట్ వారు చెప్పుకున్నారు . కాదు అయన మాకు సామంత రాజుగా వుంటాను అంటే ఆ విషయాలు మాట్లాడటానికి వెళ్ళాము అని చైనా వారు అన్నారు. .ఏది ఏమైతేనేమి ? టిబెట్ రాజుగారి ప్రతినిధులు ఓ 13  సార్లు చైనా చెక్రవర్తి గారి దర్బారుకు వెళ్లి మాట్లాడి వచ్చారు . ఇన్ని సార్లూ అంటే ఈ పదమూడు సార్లూ కూడా -- గోమ్పా రాజు గారు - - "మీ పిల్లని ఇచ్చి నాకు పెళ్లి చేయండి" అని చైనా రాజు టాంగ్ గారిని అడిగాడని - అయన కాదన్నా డని మనం అర్ధం చేసుకోవాలె .        క్రీశ - 641  నాటికీ -ఎలాగో ఓ లాగా  టాంగ్ రాజు గారు - టిబెట్ రాజు గోమ్పా తో  " నీతో పెళ్ళికి మాకు  సరే"  అన్నాడు . ఎలాగో ఓ లాగా అంటే ఏమిటంటే ? టాంగ్ రాజుగారు తన మంత్రులతో "ఆ గోమ్పా తన పట్టు వదలటం లేదు . అతని వల్ల ప్రజలకు  యుద్ధ భీతి కలుగుతున్నది . మన  ప్రజలు యుద్ధ  భయం లేకుండా  శాంతి తో  బ్రతకాలంటే ఆయనకు మన అమ్మయినిచ్చి  పెళ్లి చేయక తప్పేట్లు లేదు - కానీ  అది నాకు ఇష్టం లేదు అని వాపోయాడు .

ఈ మాటలు చైనా రాకుమారి  "రాకుమారి  వెన్చెంగ్" అనే ఆమె -విన్నది . క్రీశ - 641  నాటికీ  ఆమె వయసు 13  సంవత్సరాలు . ఆడపిల్లలు సహజంగానే వయసుని మించిన తెలివి కలిగి వుంటారు . అందులో ఈమె చైనా పిల్ల కదా ? మరీ తెలివి కలది అయింది . ఆమె " నేను ఇక్కడనే ఉంటే ఎప్పటికీ ఇట్లాగే వుంటాను . గోమ్పాను పెండ్లి చేసుకుంటే టిబెట్ దేశానికి మహారాణి ని అవుతాను కదా " అని ఆలోచించింది . అలోచించి -

చైనా లో తాను వుండే చోటునుండి 3000 కిలో మీటర్ల దూరం అవతల వూరిలో తన అత్తా వారింటిని ఎంచుకుంది .
రాకుమారి వెన్చెంగ్ పెళ్ళికి ఒప్పుకుంది కాబట్టి అని టాంగ్ రాజు గారు పెళ్ళికి ఒప్పుకున్నాడు తప్ప తనకు ఇష్టమై కాదు . ఇహ "వెంచెంగ్ " నేరుగా చైనా రాజు టాంగ్ గారి పుత్రిక కూడా కాదు .టాంగ్ వంశానికి చెందిన వారి పుత్రిక మాత్రమే .మొత్తము మీదా చైనా రాజ కన్యయే అవుతుంది . అందువల్ల టాంగ్ గారు పెళ్ళికి ఒప్పుకున్నాడు అసంగతి టిబెట్ రాజుకు కూడ తెలుసు .పెళ్లి ప్రకటన జరిగినాక - వెంచెంగ్ Gar Tongtsen Yulsung. {గర్ తుంగ్త్సేం యులిసుంగ్} అనే వారితో కలిసి టిబెట్ వైపుకు ప్రయాణం కట్టింది .

చైనా పెళ్లి కూతురు . 24 -11 -24 cpkrk2

పెళ్లి ప్రకటన జరిగినాక - వెంచెంగ్ Gar Tongtsen Yulsung. {గర్ తుంగ్త్సేం యులిసుంగ్} అనే వారితో కలిసి టిబెట్ వైపుకు ప్రయాణం కట్టింది . ఈ యన పేరు కొద్దిలో చెప్పాలంటే "లోన్" అని కానీ తుంగ్త్సేం అని కానీ చెపుతారు . ఈ లోన్ టిబెట్ రాజు గోమ్పా యొక్క సైన్యాధ్యక్షు లలో ఒకడు . గోమ్పా పెళ్లి విషయం మాట్లాడటానికి చైనా వచ్చాడు . ఇప్పుడు చైనా రాకుమారివెన్చెంగ్ ని తోడ్కొని టిబెట్ వెడుతూ వున్నాడు . వీరిద్దరూ చైనా లో ని సిల్క్ రూటు కుండా టిబెట్ కి పోతూ వున్నారు . తనను తోడ్కొని పోతూ వున్నా లోన్ ను చూసి వెంచెంగ్ . " మేము ఇద్దరమూ ఒకరి కి ఒకరం ఫది గజాల దూరంలోనే నడుస్తూ ఉన్నాగానీ - మేము ఒకరి మీద ఒకరం పడుతూ లేస్తూ పోతూ వున్నట్లుగా వుంది " " లోన్ తన రాజు గారి పెళ్లి గురించి మాట్లాడానికి కాదు . నన్ను పెళ్లి చూపులు చూడటానికి వచ్చాడు " " ఇతను పడుకోవటానికి అని మా కోటలోని పెద్ద గదిని ఇచ్చాము . అది కాదని ఇతడు వచ్చి నా మనసులోనే పడుకున్నాడు" "మనము పెళ్లి చేసుకుందామా అని

అతడు అడిగితే ఈ భూమి బద్దలై పోతుందని అనుకుంటున్నాడా? ఏమిటి ?"      " ఈ లోన్ - నా తండ్రితో మాట్లాడి నన్ను గోమ్పా కి భార్యని చేయటానికి తీసుకు వెడుతున్నాడు . నేను తన భార్యను అని గ్రహించటం లేదేమిటి ? "  అని అని అనుకున్నదిట.  అనుకున్నదిట - అని అన్న వారు ఎవరయ్యా అంటే ?  వారు దారిన పోతూ ఉండగా చూసిన ప్రజలు  .    ఇహ రాకుమారి పై విధంగా  అనుకున్నదే  అను కుంటే ,  ఆమె వున్న పరిస్థితిని బట్టి   పైకి అనే వీలు లేదు . లోలోపల అనుకుంటే ఇంకొకరికి తెలిసే వీలు లేదు .కానీ ఆమె అట్లా అనుకుని ఉంటుంది అని చైనా ప్రజలు ఎందుకు అనుకున్నారు  ??  . చైనా స్త్రీల ఉద్దేశ్యంలో - ఓ స్త్రీ ,  తన తండ్రి , పిల్లలు లేదా  భర్త లేదా ప్రియుడితో కలిసి  తప్ప, వారిని నమ్మి తప్ప ఇల్లు విడిచి వెళ్ళదు .   వెంచెంగ్ వెంట ఆమె తండ్రి లేడు, పెళ్లి కాలేదు కాబట్టి పిల్లలు లేరు భర్త లేడు . ఇహ ఉండటానికి అవకాశము వున్నవాడు   ప్రియుడు ఒక్కడే  కాబట్టి ,  " వెన్చెంగ్ " " లోన్"  ని ప్రేమించి అతని వెంట వెడుతూ వున్నదని ప్రజలు భావించారు .  ఇహ రాకుమారి   వెన్చెంగ్  చిన్న తనం నుండీ కవిత్వము చదివి- కవిత్వము రాయటానికి అలవాటు పడిన పిల్ల .  అందువల్ల వెన్చెంగ్ దారి వెంట పోతూ ఊరికనే పోకుండా "లోన్ " ని తన ప్రేమికునిగా వూహ చేసుకొని  ఏవో  కవిత్వాలు కట్టే  ఉంటుంది అని కూడా   ప్రజలు అనుకున్నారు .  పైన చెప్పిన వెన్చెంగ్ మాటలు అన్నీ కవిత్వాలా? నిజాలా?  అన్నది ఎవరికీ తెలియదు . వీరిద్దరి మధ్య ఎదో ఒక ప్రేమ భందం ఉందని చైనాలో ఒక కధ మాత్రం వుంది - ఆ కథను పట్టి అనేక నాటకాలు కూడా వచ్చాయి .కాబట్టి ఈ  సంగతి మీ దృష్టికి తెచ్చాను .

వెన్చెంగ్ - లోన్ ని ప్రేమించింది ఏమో?  అనుకున్న ప్రజలే -- ఆమె  " విధి నన్ను ఎవరి చేతుల్లోకి జారవిడిస్తే నేను  వారి చేతుల్లోకి పోతాను " అని పాడుకుంటూ  ప్రయాణం చేసింది అని కూడా అనుకున్నారు   . దీనిని బట్టి వెంచెంగ్ - లోన్ ని  ప్రేమించింది అనే  నమ్మ వచ్చు . ప్రేమించిందా లేదా  అన్నది ఓ సస్పెన్సు.

వెన్చెంగ్ టిబెట్ కి వెళ్లిన కాలంలో , చైనా వారు టిబెట్ ను టిబెట్ అని కాక టుబా అని పిలిచేవారు . టుబా పెద్ద అనాగరిక దేశము అని కూడా చెప్పుకునే వారు .

రాకుమారి వెన్చెంగ్ తెలివి కల పిల్ల అనుకున్నాము కదా ? ఆమె తన పెళ్లి కోసం అని టిబెట్ కు పోతూ - అక్కడ నా పుట్టింటిలో వుండేవన్నీ వుంటాయో లేదో ? టిబెట్ ఎంతో అనాగరిక / ఆటవిక దేశము అని వింటూ వున్నాను - నిజం ఏమిటో ? అని అలోచించి - తన వెంట - చైనా పుస్తకాలు - చైనాఆహారధాన్యాల విత్తనాలు - చైనాపూల పండ్ల పండ్లు విత్తనాలు - చైనాకు చెందిన వేలాది మంది నేత , కమ్మరి - కుమ్మరి - కంసాలి వంటి చేతి వృత్తుల పని వారిని తన వెంట తీసుకు వెళ్ళింది .

చైనా రాకుమారి టిబెట్ ఆరిహద్దులలోకి ప్రవేశించే సరికి - టాంగ్ అనే రాజ వంశము నుండి భౌద్ధ ముని గా మారిన వారొకరు వచ్చి రాకుమారిని కలిసాడు . రాకుమారి ఆయనకు చక్కని ఆతిధ్యము ఇచ్చి ఎంతో గౌరవించింది . అప్పుడు ఆ ముని రాకుమార్తెను ఎంతో మెచ్చి - ఆమెకు కొన్ని అద్భుత శక్తులు ఇచ్చాడు - రాకుమారి వెన్చెంగ్ చైనా నుండి తరలి వస్తున్న శాంతి దేవత అని- ఆమె బుద్ధుని తల్లి ఐన తారా దేవితో సమానమని కీర్తించాడు . ఇటుతరువాత వెంచెంగ్ కు " లోన్ " తో ఎదో ప్రేమ వ్యవహారము ఉన్నదన్న అనుమానము ప్రజలలో నుండి తుడిచి పెట్టుకు పోయింది.

చైనా పెళ్లి కూతురు 25 -11 -24 cpkrk3

చైనా పెళ్లి కూతురు - వెన్చెంగ్ టిబెట్ లోకి ప్రవేశిస్తూనే - ఆ భూభాగాన్ని తన తెలివితో అంచనా కట్టి - టిబెట్ వెల్లికలా పడివున్న దయ్యం లాగ ఉందని -- టిబెట్ వారు కట్టిన గుడులు అన్నీ కూడా ఆ దయ్యం తిరిగి పైకి లేవకుండా బరువు ఉంచటం కోసం కట్టిన గుడులే అని ఊహించింది .

పెన్చెంగ్ చైనా నుండి వస్తూ ఒక అద్దాన్ని తెచ్చుకున్నది . ఆమె చైనా బోర్డర్ దాటేవరకూ ఆ అద్దంలో వెనక్కి పోతూ ఉన్న చైనా ను చూసుకుంటూ వచ్చి తాను టిబెట్ లోకి ప్రవేశించగానే ఆ అద్దాన్ని పారవేసింది . అంటే చైనాను మనసులో నుండి తొలగించి వేసుకుంది . అత్తవారింటి ని సమీపిస్తున్నపుడు ఇలా అద్దాన్ని పారవేయటం -చైనా ఆడపిల్ల చేయ వలసిన ఆచారం .ఇలా అద్దాన్ని పార వేయడం వల్ల ఆడపిల్లకు ఏవన్నా అదృష్ట శక్తుల తోడు గా వస్తే - అవి ఆమె అత్తగారింటికి మేలు చేయటానికి మాత్రమే పరిమితమౌతాయని , పుట్టింటి వారికి మేలుకలిగించటానికి పోవు అని కూడా చైనాలో ఓ నమ్మకం వుంది . చైనా రాకుమారి పెన్చెంగ్ అద్దము పారవేసింది కాబట్టి - ఇందాక బౌద్ధ ముని ఆమెకు ఇచ్చిన దివ్య శక్తులు ఏవైనా కానీ అవి టిబెట్ కు మేలు చేయటానికి మాత్రమే పనికి వస్తాయి.

రాకుమారి పెన్చెంగ్ వస్తూ వస్తూ తొమ్మిది బుద్ధ ప్రతిమలు వెంట తెచ్చుకుంది . టిబెట్ అంటే వెల్లికల పడిన దయ్యమే కాబట్టి ఆ దయ్యం పైకి లేవకుండా ఉంచే బరువు కోసం , తాను కూడా మరిన్ని గుడులు కడితే అత్తవారి దేశానికీ ఎంతో మేలు చేసినట్లు అవుతుంది కదా ? అని ఆలోచించి . తనతో పాటుగా తెచ్చుకున్న తొమ్మిది బుద్ధ ప్రతిమలకు తొమ్మిది గుడులు కట్టాలని సంకల్పించింది . ఎటుచూసినా గానీ టిబెట్ కొండలే కనపడ్డాయి . అప్పుడు పెన్చెంగ్ తన తలలోని వెంట్రుకల చిక్కు తీసుకోగా ఊడి వచ్చిన వెంట్రుకలను కొండలపై వెదజల్లింది . ఆ వెంట్రుకలలో నుండి పచ్చని చెట్లు మొలిచాయి . రాకుమారి తన వద్ద వున్న బుద్ధ విగ్రహాలను అక్కడ ఆ చెట్ల కింద ఉంచింది . ఈ మహిమాలన్నీ ఆమె తార దేవి రూపము అవటం వల్ల నూ - బౌద్ధ ముని ఇచ్చిన వరాల వల్ల నూ జరిగాయని ప్రజలు నమ్మారు . ఇట్లగా టిబెట్ లోకి ప్రేవిసించే సరికి , పెన్చెంగ్ పట్ల ప్రజలకు నూరు శాతం భక్తీ , గౌరవం కలిగింది .

ప్రజల గౌరవము, మన్ననలు పొందిన రాకుమారి తనను పెండ్లి ఆడటానికి వస్తూ ఉన్నందున - టిబెట్ రాజు గోమ్పో-- రాకుమారిని స్వాగతించటానికి ఎదురు వెళ్లి బోహా అనే సరస్సు వద్ద { Bohai Lake }. ఆమెను కలుసు కుని - స్వాగతించాడు .ఆపై ఆమెను పెండ్లి చేసుకున్నాడు .

" ఇంతవరకూ చైనా చెక్రవర్తి కూతురిని పెండ్లి యాడిన టిబెటన్ రాజు ఎవడూ లేడు . ఆ పని మొదటగా చేసింది నేనే' అంటూ గర్వపడి న టిబెట్ రాజు గోమ్పో- న భార్య వెన్చెంగ్ కోసం ఆ సరస్సు ఒడ్డునే పెద్ద భవంతిని కట్టించాడు .

రాకుమారియొక్క పెండ్లిని నిర్వహించటానికి పెళ్లిని రాజా లాంఛనాలతో జరిపించటానికి అని - చైనా రాజు గారి అల్లుడి వరుస ఐన వారు ఒకరు వెన్చెంగ్ వెంట వచ్చాబు . అంటే రాకుమార్తెకు బావ వరుస అయన వచ్చాడు . ఆయనను - ఆయన ధరించిన పట్టు వస్త్రాలనూ చూసిన టిబెట్ రాజు గోమ్పో గారు ఆయన కూడా ఎదో చక్రవర్తి అని భ్రమ పడి ఆయనికి- చైనా చెక్రవర్తికి చేయవలసిన నమస్కారాలు చేసాడు . ఈ సమయంలో గోమ్పో రాజుగారు తన మొఖానికి ఎర్రని రంగు పూసుకుని వున్నాడు . ఆరోజుల్లో -- పెళ్లి సమయం లో అందంగా కనపడాలని-- టిబెట్ లోని మొగ వాళ్ళు అందరూ ముఖాలకు ఎర్ర రంగు వేసుకునే వారు ఆ ఆచారాన్ని పట్టి గోమ్పో కూడా ముఖానికి ఎర్రరంగు వేసుకున్నాడు . ఇహ ఆరోజుల్లో టిబెట్ వారికి పట్టు వస్త్రాలు తెలీదు . అందువల్ల పట్టు వస్త్రాలు కట్టుకున్న చెక్రవర్తి అల్లునికి ఎంతో మర్యాద ఇచ్చాడు . చైనా చెక్రవర్తి అంటే ఇట్లా నే ఉంటాడు అనుకున్నాడు .

ఇవన్నీ చూసిన రాకుమారి ఎంతో సిగ్గు పడి "నా మొగుడు ఎంతో ఎడ్డోడు - ఈయనకీ ఈయన దేశానికీ నేను ఎంతో నేర్పాలి - నా కాపురాన్ని నేను సరిదిద్దు కోవాలి " అనే నిర్ణయం తీసుకున్నది .

అనగా మన తెలుగు నాట అత్తగారింట కొత్తగా అడుగు పెట్టిన కోడలు అనుకున్నట్లే అనుకున్నది . ఆ రకంగా ఆమె తన అత్తా వారి ఇంటిని సమూలంగా మార్చి వేసే పూనిక పూనింది . మొదటగా - రాజా వంశం వారితో సహా మొగవారెవరూ ముఖాలకు రంగులు వేసుకో కూడదు అనే చట్టం తెప్పించింది .

వెన్చెంగ్ తన వెంట తెచ్చుకున్న బుద్ధ ప్రతిమ పేరు Jowo Shakyamuni Rinpoche /జోవ శక్యముని రిపోచే . రాకుమారి చైనా వారి పద్ధతిలో ఈ విగ్రహానికి ఓ పెద్ద మందిరం కట్టించింది . అమందిరంలో చైనా దేశపు పుజా పద్ధతులు అమలు పరిపించింది .

అప్పట్లో టిబెట్ వారు వ్యవసాయం చేసే వారే గానీ నీటి కాలువలు తవ్వి పంటలకు నీరు పెట్టటం వారికి తెలీదు . వెన్చెంగ్ చైనా వారి వ్యవసాయ పద్ధతులు టిబెట్ వారికి నేర్పించింది . టిబెట్ వారు ఓ గోధుమ పంటను వేసి - అది మొలకెత్తి పెరుగు తున్న విధానాన్ని పట్టి కాలం లెక్క వేసుకునే వారు . ఎట్లాగంటే .. గోధుమ మొలకెత్తిన మూడో రోజున మా అమ్మాయి పుట్టింది .. గోధుమ పంట కోసిన తరువాత మా పెళ్లి నిశ్చయమై - పంట నూర్పిడులు ఆయిన ఆరో పగటి రోజున మా పెళ్లి అయింది అని చెప్పుకుంటూ వుండే వారు . రాకుమారి వెంచెంగ్ ఈ పద్ధతిని కాదని తన చైనా దేశపు క్యాలెండర్ ని టిబెట్ లో అమలు చేయించింది . రాకుమారి వెంచెంగ్ వెంట నేత పనివారు లోహపు పని వారు వచ్చారు కదా ? వారు టిబెట్ వారికి పట్టు పురుగులు పెంచటం పట్టు దారం తీయటం పట్టు వస్త్రాలు నేయటం నేర్పారు . చైనా లోహపు పని వారు లోహంతో అనేక వస్తువులు చేయటం ఎలాగో టిబెట్ వారికి నేర్పారు . పర్యవసానంగా నేడు టిబెట్ లో కనపడే అత్యద్భుత బౌద్ధ మందిరాలను - టిబెటియన్లు నిర్మించు కో గలిగారు .ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో ఉంటాయి . రాకుమారి వెంచెంగ్ మూలకంగా టిబెట్ కాస్తా చైనా లాగ మారి పోయింది.

ప్రజలు మంచి మంచి మార్పులన్నింటినీ  స్వాగతించి - కొన్నిటిని నిరసించారు  . టిబెట్ లోని మొగవారు - తమ భార్యలు తమకు నచ్చని పనులు చేసినపుడు లేదా ఉపయోగ కరమైన సలహాలు చెప్పినపుడు " నువ్వు అచ్చం చైనా పెళ్లి కూతురులా చేస్తున్నావు " అనో    లేదా " నువ్వు అచ్చం చైనా నుండి వచ్చిన భార్యలా చేస్తున్నావు " అనో దెప్పుతూ ఉండేవారు .

ఇట్లగా -  క్రమంగా  రాకుమారి వెంచెంగ్  పేరు  గ్యాసా {Gyasa ) గా మారి పోయింది. టిబెట్ భాషలో ని గ్యాసా అనే మాటకు అర్ధం  "చైనా పెళ్లి కూతురు " లేదా "చైనా నుండి వచ్చిన భార్య " అని .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

చైనా పెళ్లికూతురు - 26 -11 -24 cprk4

ప్రిన్సెస్  వెన్చెంగ్  లేదా  చైనా పెళ్లికూతురు -తన స్వీయ పర్యవేక్షణలో - Ramoche రామోచే . అని పిలవబడే పెద్ద బౌద్ధ మందిరాన్ని-- టిబెట్ లో కట్టించింది .ఆ మందిరంలో తనతో పాటు తెచ్చుకున్న { Jowo Shakyamuni Rinpoche }  "జోవ  శక్యముని  రిపోచే" అనే విగ్రహాన్ని ప్రతిష్టించింది  {  Jowo  అనే టిబెట్ మాటకు  ప్రతిమ అని అర్ధము }.

ఇక టిబెట్ రాజు "సొంగ్ట్సన్  గోమ్పా"    గారికి--  చైనా నుండి వచ్చిన భార్య ఏ కాక నేపాల్ దేశము నుండి వచ్చిన-  రాణీ భ్రికుటీ   దేవి అనే ఆమె మొదటి భార్య గా  వున్నది . ఆమె తన పుట్టింటి కట్నముగా "Jowo Mikyo Dorje "  "జావ  మైక్యో  దోర్జే"  అనే బుద్ధ విగ్రహాన్ని - వెంట తెచ్చుకున్నది .  ఈ  రాకుమారి ఆ  బుద్ధ ప్రతిమని Jokhang

జాఖాన్గ్   అనే పేరుకల మందిరము లోప్రతిష్టించి  పూజలు చేస్తూ ఉండేది
.

ఈ "జాఖాన్గ్ " అనే మందిరము --    టిబెట్ రాజు  " సొంగ్తసేం గోమ్పా" గారు కట్టుకున్నది   . అయన  తన పెళ్ళికి ముందు నుండే బౌద్ధ మత అనుమాయి . బౌద్ధము మీది ఆదరణతో  ఆయన టిబెట్లో 12  పెద్ద బౌద్ధ మందిరాలు కట్టించాడు . రాజు గోమ్పా  గారుఈ  మందిరాలు కట్టటానికి కావాల్సిన స్థలాన్ని ఎన్నుకునే ఫద్దతి ఎంతో  విచిత్రంగా ఉండేది . అయన తన తలపై వుండే టోపీని గాలి లోకి ఎగురవేసి అది ఎక్కడ పడిందో అక్కడ బౌద్ధ మందిరము కట్టేవాడు . ఒక వేళ టోపీ గాలిలో తేలుతూ వెళ్లి ఏదన్న సరస్సులో పడితే ఆ సరస్సు మధ్యలోనే బౌద్ధ మందిరం కట్టించే వాడు . ఇలా కట్టించిన   12 మందిరాలలో   Rasa Thrulnag Tsuklakhang . అనే మందిరము అతి పెద్దది . మందిరాన్నే  జాఖాన్గ్ అని కూడా పిలుస్తారు . {ఎందుకు పిలుస్తారో చివరిలో చూద్దాము}   ఈ మందిరములో నే నేపాలీ రాకుమారి  తాను తెచ్చుకున్న బుద్ధ ప్రతిమని ప్రతిష్టించి  పూజలు జరిపించింది .

ఇక Rasa  అన్న మాటకు "మేక " అని అర్ధము . ఈ మందిరము కట్టటానికి  అవసరమైన వస్తువులని  మేకల చే -- కొండల మీదకు మోయించారు  .కాబట్టి ఆలా పేరు పెట్టారు . rasa రాసా అనే మాట క్రమంగా లాస అయింది . రాసా మందిరము చుట్టూ  రాసా  అన్న పేరున ఒక పట్టణము సృష్టి అయింది . కాల క్రమేణా  రాసా  లాసా అయ్యింది . ఈ రాసా  మందిరము "జాఖాన్గ్ "అయ్యింది . ఈ మందిరము నేటికీ టిబెట్ రాజధాని లాసా లో వున్నది .

చైనా నుండి వచ్చిన రాకుమారి తాను తెచ్చిన "శాక్య ముని బుద్ధా" అనే విగ్రహాన్ని - రామోచే అని మందిరం కట్టించి అందులో పెట్టి పూజలు జరిపించింది కదా? . కానీ రాజు గోమ్పో మరణానంతరము రామోచే అనే మందిరము ధ్వంసం చేయ పడటం వల్ల - వెన్చెంగ్ తెచ్చిన శాక్య ముని బుద్ధా విగ్రహాన్ని - ఆమె భర్త టిబెట్ రాజు గోమ్పో కట్టించిన Rasa Thrulnag Tsuklakhang కు మార్చింది . అప్పటినుండి Rasa Thrulnag Tsuklakhang ను Jokhang జొఖాన్గ్ మందిరము అనగా రెండు విగ్రహాలు ఒకే చోట కల మందిరం. అని పిలిచారు .ఈ మందిరము ఇందులోని రెండు విగ్రహాలు నేటికీ మనుగడలో వున్నాయి .

మొత్తము మీద-- క్రీశ 620 లో పుట్టిన వెన్చెంగ్-- క్రీశ 680 / 682 మధ్యన లాసా , లో మరణించింది. ఈమె తన జీవిత కాలములో తనకు సవతి ఐన నేపాలీ రాకుమారి భ్రికుటి దేవితో సఖ్యతతో గడుపుతూ -టిబెట్ రాజ్య పాలనలో తన భర్తకి సహాయపడి , టిబెట్ కి చైనాకు తేడా లేదు అనే విధంగా టిబెట్టును మార్చి వేసింది . వెన్చెంగ్ మరణానంతరము చైనా వారు " ఆమెను " చైనా నుండి వచ్చిన న పెళ్లికూతురు అనటంకన్నా " చైనా నుండి వచ్చిన "అత్యున్నత సాంకేతిక సలహా దారు .గొప్ప పరిపాలకురాలు " అని చెప్పుకోవటం సమంజసం అంటూ తమ సాహిత్యం లో రాసుకున్నారు . వెన్చెంగ్ వలన --టిబెట్ లో, చైనా వారి సంప్రదాయాలు కళలు ఎన్నో ప్రవేశించి - టిబెట్ అంటే ఇంకో చైనా లాంటిదే తప్ప ఏమీ బేధం లేదు అనే పేరు తెచ్చుకుంది . రెండు దేశాలలో ఒక్కలాటి సంస్కృతి సంప్రదాయాలతో ఉండటం అనే సంగతిని ఆధారం చేసుకొని - చైనా దేశము 20 వ శతాబ్దం లో టిబెట్ ని ఆక్రమించుకొంది . ఆక్రమించుకొని " మా ఇరువురి సంస్కృతీ సంప్రదాయాలు దేవుళ్ళు ఒకటే , అనేదానిని బట్టి

చూస్తే టిబెట్ అనేది మా పురాతన చైనా యొక్క భూ భాగము " అని మీకు అనిపించటం లేదా అని ప్రపంచ దేశాలని ప్రశ్నించి -- తాను టిబెట్టును ను ఆక్రమించటాన్ని సమర్ధించుకొంది .

నేటికి 14 వందల ఏండ్లక్రితము ఎన్నడో చైనా నుండి టిబెట్ వచ్చిన వించెంగ్ కి టిబెట్ వారు ఎంతో రుణ పడి వున్నారు అనుకుంటే - టిబెట్టును ఆక్రమించటం ద్వారా చైనా వారు ఆ రుణాన్ని రాబట్టుకున్నారు అనుకోవాలి . వెన్చెంగ్ తన అత్తగారి ఇల్లు టిబెట్ - చైనా వారి పరమయ్యేట్లు బాటలు వేసి పోయింది . ఆడవారి పుట్టింటి ప్రేమ ఎంతో గొప్పగానూ- ఒక్కొక్కప్పుడు ఎంతో ప్రమాదకరం గానూ ఉంటుంది .

ఇహ వెన్చెంగ్ కి పిల్లలు ఉన్నారా ? అంటేవున్నారు . చనిపోయిన స్థితిలో పుట్టిన మొగ బిడ్డ ఒకరు వున్నారు . వెన్చెంగ్ ఈ మృత శిశువు మీద వున్న ప్రేమకొద్దీ - ఆ శిశివు అవశేషాలపై - బుద్ధుని అవశేషాలపై నిర్మించిన స్తూపాలను పోలిన స్తూపాలను నిర్మించుకుంది . ఈ కధ మొదటిలో చెప్పుకున్నట్లు - వెన్చెంగ్ అంటే బుద్ధుని తల్లి ఐన తార యొక్క అవతారామని ప్రజల నమ్మకం -- కాబట్టి ఈమెకు పుట్టిన శిశువు బుద్ధుని అంశే అవుతాడు అనుకుంటూ ప్రజలు అలంటి స్తూపాల నిర్మాణాన్ని ఆమోదించారు . బిడ్డల మీద దుఃఖంతో వారికీ స్తూపాలు కట్టించిన టిబెట్ రాణి మరొకరు ఉన్నట్లు నా దృష్టికి రాలేదు . అట్లాగే టిబెట్ లో వున్న స్తూపాలు అన్నీకూడా బుద్ధుని అవశేషాల మీద కట్టినవే కావని - వేరేవి కూడా వుండి వుంటాయని మనము ఈ కధ ఆధారంగా ఊహించవచ్చు . ఇహ భారత దేశములో కూడా బుద్ధుని అవశేషాల మీద నే కాక -బౌద్ధాన్ని అనుసరించిన రాజులూ వారి యొక్క సంతతి యొక్క అవశేషాల మీద కట్టిన స్తూపాలు కూడా వుండి ఉండవచ్చు నాని నాకు అనుమానము వచ్చింది . ఇది కేవలం నా అనుమానమే . నిజమేమిటో నాకు తెలీదు .

పెన్సెంగ్ కి పుట్టిన బిడ్డ - టిబెట్ రాజు గోమ్పో గారి వలన పుట్టిన వాడు కాదు అని ,ఓ కధ ప్రచారం లో వుంది . ఈ కథ మొదటిలో పెన్సెంగ్ చే ప్రేమించ బడి ఉంటాడేమో అని ప్రజలు అనుమాన పడిన తుంగ్త్సేంTongtsen లేదా "లోన్ " వల్ల పెన్సెంగ్ కి కలిగిన బిడ్డ అని ఆ కధ లో ఉంది . ఆ కధ నిజమని మీరూ నేను నమ్మితే అది పెన్సెంగ్ ఆత్మను భాదిస్తుందేమో అని నా భయం .
టిబెట్ వారి దృష్టిలో పెన్సెంగ్ - బుద్ధునికి తల్లి ఐన తార దేవి లాంటిదని - దాని వల్ల ఆమెకి పుట్టిన బిడ్డ అతడు బుద్దిని యొక్క ఓ అంశ అవుతాడని ప్రజలు భావించారని మనము చెప్పుకున్నాము కదా ? ఈ నమ్మకాన్ని ఆధారం చేసుకొని టిబెట్ బౌద్ధ సన్యాసులలలో ఒకరైన Bhakha Tulku "భక తులకు" అనే అయన ఈమధ్యకాలంలో " ఆ నాడు పెన్సెంగ్ కి పుట్టి మరణించిన బిడ్డ తిరిగి అనేక జన్మలు ఎత్తింది . ఇప్పుడు ఎత్తిన జన్మను నేనే " అంటూ ఓ ప్రకటన చేసుకున్నాడు . ఆయనకు కొందరు అభిమానులు కూడా ఏర్పడ్డారు .

దీని తరువాత రాకుమారి బ్రికూటేశ్వరీ దేవి కధ చెప్పాలి అనుకున్నాను కానీ ఆమె కధగా చెప్పటానికి ఏమీ లేదు . ఆమె నేపాలీ రాకుమార్తె . భారత దేశములోని నేటి బీహార్ ప్రాంతమును పాలిస్తూ ఉన్న లిచ్ఛవీ రాజులు - నేపాల్ యొక్క ఖాట్మండూ లోయలో రాజ్యము ఏర్పరిచారు . ఈమె వారి కుమార్తె . టిబెట్ రాజు గోమ్పో గారు "మీ పుత్రికను మాకు ఇచ్చి వివాహం చేయండి " అని కోరగా నేపాల్ రాజు అందుకు సమ్మతించి వారి వివాహం జరిపించాడు .
టిబెట్ వారు భ్రికుటి దేవి ని కూడా తారా దేవి రూపంగానే చూసారు . కానీ ఈమె తెల్ల రంగు తారాదేవి యొక్క రూపమని అన్నారు .పెన్సెంగ్ ని పచ్చరంగు తారాదేవి అన్నారు. పూర్తిగా వికసించిన కమలము ఉంటే ఆమె తెల్ల తారా దేవి అనబడుతుంది . సగం వికసించిన కమలము ధరించిన ఆమె పచ్చ తారాదేవి అనబడుతుంది



**From right to left: Bhrikuti Devi, Songtsen Gampo and Wen Cheng**

కఈ భాగముతో ఈ చారిత్రక కథ సమాప్తం

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా  శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

**6.**గిర్రి  గాడి పెళ్లి  19 -11 -24            rfrk01

గిర్రడు లేదా గిరి  గాడు అనబడే గిరీశం గారు తన శిష్య కోతికి లెక్కలు చెపుతూ వున్నారు . శిష్య కోతికి బదులు శిష్య కోటికి  అన్నా కూడా ఒప్పేను . ఎందుకంటే ఒకడే ఒక్కడైన వెంకటేశం కోటి విద్యార్థులకు సమానం కాబట్టి .  గిరీశం లెక్కలు చెప్పేది బుచ్చెమ్మ వదిన - పప్పు రుబ్బుతూనూ , అగ్నిహోత్రావధానులు జపము చేస్తూ  నూ -- దొంగ చాటుగా వింటూ వున్నారు .

" ఏమోయ్ వెంకటేశం - ఒకడు మనకోసం అని  కూర గాయాల కొట్టు నడుపుతూ వున్నాడు .  ఆరోజు సన్నమిర్చి  కిలో ముప్పై రూపాయలు

అనుకో . అదే రోజు గోరు చిక్కుళ్ళ ధర కిలో ఎనభై అనుకో . ఆరోజు షాప్ అయన కిలో పచ్చి మిర్చీ తీసి వంద కిలోల గోరు చిక్కుళ్ళలో కలిపాడు . గోరు చిక్కుళ్ళు అన్నీ అమ్ముడు పోయే సరికి ఇంకా కొంచెం కొంత ఎక్స్ట్రా లాభం వస్తుందని . సరే ఇంకొక రోజున బీన్స్ ధర కిలో నలభై గా వుంది . పచ్చిమిర్చి కిలో వంద గా వుంది .అపుడు షాప్ అయన కిలో బీన్స్ తీసి పాతిక కిలోల పచ్చి మిర్చీలో కలిపేసాడు . సరుకంతా అమ్ముడయ్యే సరికి ఇంకొంచం లాభం అదనంగా వస్తుందని . అలాగే ఇంకో రోజున గింజ చిక్కుడు కాయల ధర కిలో నూట యాభై గా వుంది . ఆరోజు గోరు చిక్కుడు ధర అరవైగా వుంది . పచ్చి మిర్చీ ధర కిలో ముప్పై గా వుంది . షాప్ వాడు కిలో గోరు చిక్కుళ్ళు తీసి యాభై కిలోల గింజ చిక్కుడు కాయల్లో కలిపాడు . ఆర కిలో పచ్చి మిర్చీ తీసి పది కిలోల గోరు చిక్కుడు కాయల్లో కలిపాడు . .. దీనివల్ల-- అనగా ఈ లెక్క వల్ల మనకు ఏమి తెలుస్తూ వుండే ?" అని అడిగాడు .

వింటూ ఉండి న బుచ్చెమ్మ అబ్బుర పడి పోయింది. నా తమ్ముడు ఎంతలేసి లెక్కలు తలకెత్తు కుంటున్నాడోనూ అనుకుంటూ . అగ్ని హోత్రావధాన్లు గారు ఉష్ణం వచ్చిన వాడల్లే ఎగిరి పడి " ఈ చదువులు మూలాన యావత్ బ్రహ్మణ్యమూ చెడి పోతూ వున్నదని చెడుఃగుడూ ఆడటం మొదలెట్టాడు .

" అలాక్కాడండి . ఈ చదువువల్ల ఎంతో లాభము ఉందని, తమరి చేతే అనిపిస్తాను చూడండి . అలా ఒప్పించినా వాడినయితే -- మరి మీ బుచ్చెమ్మ గారిని నాకు ఇచ్చి వేస్తారా ? " అని మనసులో అనుకుంటూ వున్నది వెల్ల కక్కే సాడు. " తమరి మొఖానికి అదొకటా అంటా ? అని అగ్ని హోత్రావధానులు గారు పైకి చిటపటలాడుతూ - గాయత్రీ సాక్షిగా సరే అన్నాడు .

" ఏమివాయ్ వెంకటేశం నీ సమాధానం ఏమిటట ? "

" మరే నండీ -- ఈ పంఫిణీ మీదే ఇంగిలీషు వాడు కోట్లు ఆర్జిస్తూ ఉండెను . అదెట్లాగో చెపుతాను వినండి . ఉదాహరణకు వంద కిలోల గోరు చిక్కుడులలో ఒక కిలో పచ్చి మిర్చీని బాగా మిళితం చేసినపుడు - కొనే ఆయనకి కిలోకి ఫది గ్రాముల పచ్చి మిర్చీ ముడుతుంది -అదీనూ గోరుచిక్కుళ్ళ రేటుకు. అప్పుడు కొనుగోలు దారు తన సొమ్ముకు తగ్గ విలువ రాబట్టుకోవటానికి బదులు - ఎంతో బద్ధకంతో ఈ నాలుగుమిర్చీలు ఎరితే వచ్చేది ఏముంది- ఏరక పోతే పోయేది ఏముంది అని బద్ధకించి ఆ కూరగాయను , ఇచ్చిన మోస్తరులోనే తీసికెళ్ళి పోతాడు . దీనిని బట్టి మన భద్ధకమే మనకు నష్టము అని మన హుషారే మనకు లాభమని తెలుస్తున్నది " అన్నాడు వెంకటేశు బుర్ర గీక్కుంటూ .

"చూచారు టండీ మామగారూ - మీ కుర్ర కుంక ఈ వయసుకే లాభాల గురించి మాట్లాడేస్తున్నాడు . మరి వీడికింకా తిరుగు లేదు . నేను అలాగా తర్ఫీదు ఇచ్చాను " అన్నాడు గిరీశం గారు .తనకు పెళ్లి కుదిరినట్లే అని సంబరాలు పడుతూ .
" ఏమిటో ఏమిటీ అర్ధం కాకుండా వుంది " అన్నాడు అవధాన్లు గారు .
" అయ్యా మీ వాడు చెపుతున్నది ఏమంటే .. గడప దాటి వెళ్లి ఓ టిఫినో , ఓ వస్తువో తెచ్చు కోవటానికి మనకున్న బద్ధకాన్ని ఆసరా చేసుకుని . శ్విగ్గీ వాడు జామతో వాడు ఆమెగాన్ వాడు షిప్ క్యార్ట్ వాడు కోట్లు సంపాదిస్తున్నారు . దానికి కారణమూ మన భద్ధకమేనని - నేను మాత్రము బద్ధకించకుండా హుషారు తనము తో డబ్బులు ఆదాచేసి మీ ఆస్తికి పెంపు చేస్తాను అని చెపుతూ వున్నాడు . అనగా మీ వాడి మెదడు లాభాల గురించి ఆలోచిస్తూ వున్నదని చిత్తగించారో ? " అన్నాడు గిరీశం .

" అద్గదీ-- చదువులు అంటే అల్లాగే ఉండాలి .ఇందువల్ల బ్రాహ్మణ్యం చెడి పోయినా మంచిదేను అని నా ఉవాచ- అని చిత్తగించండి . మీకు మా బుచ్చెమ్మను ఇచ్చి దాని గొంతుక కోద్దునా ? వద్దా ? అన్న ఆలోచన నా మనసులో ఎప్పటి నుండో ఉన్నదెనూ .మరి తమరి యోగ్యతా కనిపెట్టు దామని కాస్త నిదానించాను . మీ కన్నా యోగ్యులు మాకు దొరుకుతారుటా చెప్పండి . ఇహ మీరూ మా వాడు పెళ్లి చద్దన్నాలు - ఆవకాయ. మీగడ పెరుగు లు తిని రండి . తమ పెళ్లి విషయము కులాసాగా ముచ్చటించుకుందాము" అన్నారు అగ్ని హోత్రావధానులు గారు .
ఇటు తరువాత బుచ్చెమ్మ సిగ్గుతో ఇంటిలోకి పరుగు లెట్టింది . మేము లేచి పోయి పెండ్లి చేసుకో నక్కర లేదు కదా అనుకుంటూ .

ఈ కథకు ఏమి పేరు పెడదాం అన్న విషయం మీద నాకేమీ తేలలేదు .అందువల్ల ఎదో ఆపేరు పెట్టేసాను . మీరు ఓపిక చేసుకొని ఈ కథకు ఏదన్న ఓ పేరు ఊహించుకొని - బహుమానాలు అవీ ఉచ్చుకొని మన ఘిర్రి గాడి పెళ్ళికి రావాలని మీకు శుభ ఆహ్వానం పలుకుతున్నది ఎవరయ్యా అంటే -- ఈ కథను స్వంత గా కల్పించి రాసిన వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి - తప్ప ఇంకోరు కాదు . వస్తాము అనే వారందరికీ ధన్య వాదాలు అండీ . ఉంటానండీ . తమరు కూడా వుండండి .

## **5.**పుష్పక విమానం **18 -11 -24**

పుష్పక విమానం ఆకాశం లో నుండి కిందకి వచ్చింది . ఈ విమానం ఒక లిఫ్ట్ లాగా- గ్రౌండ్ ఫ్లోర్ నుండి టాప్ ఫ్లోర్ కి - టాప్ ఫ్లోర్ నుండి గ్రౌండ్ ఫ్లోర్ కి నిమిషానికి ఒక సారి చొప్పున ఆటో మ్యాటిక్ గా తిరిగే

విమానము . లిఫ్టు నడిపే వాడు లిఫ్ట్ బాయ్ అని పిలవక, తప్పనట్లు - ఈ పుష్పక విమానాన్ని నడిపే ఆయనని పైలెట్ అని మనము పిలవక తప్పదు. విమానము ఆటో మాటిక్ ది కాబట్టి ఆ విమానం నడిపే పని పైలెట్ కు లేదు . ఆ పని దాని యజమానిది . ఆ యజమాని ఎక్కడో కూచునుండి విమానం లో కి ఎవర్ని ఎక్కడనుండి ఎక్కించాలో చెపుతూ ఉంటాడు .ఆ ప్రకారం జనాన్ని విమానం లోకి ఎక్కించటమే పైలెట్ పని .

విమానం లోకి ఎంత మంది ఎక్కినా అందులో ఇంకొక్కరికి చోటు మిగేలేట్లుగా విమానంలో ఓ పవర్ వుంది . ఎప్పుడూ కూడా ఇంకొక్కరికి కి చోటు మిగిలే వుండే విమానం కాబట్టి- యజమాని గారికి ఆచి తూచి టికెట్లు ఇష్యూ లేదా కట్ లేదా కోయాల్సిన పని ఏమీ లేదు . అట్లాగా అయన సర్వ స్వతంత్రుడు . అయన ఇష్టం వచ్చినన్ని టికెట్లు కొడతాడు . ఇదేంటని అడగటానికి మనకు వీలు లేదు .

ఇప్పుడు పుష్పక విమానం ఒక ఇంటి మీద నుండీ ఎగురుతూ వుంది . " అదుగో ఈ ఇంట్లో నుండి ఒక టికెట్ రిజర్వు అయింది. వారిని విమానం ఎక్కించండి " అని పైలెట్ గారికి సందేశం అందింది . ఒకే ఇంటి నుండి ఒకే సారి ఇద్దరూ ముగ్గురూ ఎక్కే సందర్భం కూడా ఉంటుంది. ఇప్పుడు ఒక్కరినే ఎక్కించ మన్నారు - నాకు కొంచెం శ్రమ తప్పినట్లు - కొంచెం టైం సేవ్ అయినట్లు -- అనుకున్నాడు పుష్పక విమానం పైలెట్ గారు .

ఈ విమానం ఆసులో కండె వల్లే-లేదా ఓ లిఫ్టుకు మల్లె గ్రౌండ్ ఫ్లోర్ కి టాప్ ఫ్లోర్ కి తిరుగుతూ ఉంటుంది అనుకున్నాం కదా ? విమానం కాస్త పైకి ఎగరి ఆ ఇల్లు కను మరుగై- ఆ ఇల్లు ఉన్న చిన్న పల్లెటూరు కనపడగానే " ఈ ఊరులో మొత్తం రెండు టికెట్లు రిజర్వు అయివున్నాయి

.ఈ ఊరినుండి మొత్తం ఇద్దర్ని విమానం ఎక్కించు "అన్నాడు యజమాని గారు .అలాగే జరిగింది .
విమానం ఇంకొంచం పైకి లేవగానే ఓ చిన్న పట్టణం కనపడింది .ఈ పట్టణం నుండి ఆరుగురికి రేజర్వేషన్ వుంది వారిని విమానం ఎక్కించు" అన్నాడు యజమాని గారు ."పల్లెలనుండి రేజర్వేషన్ లు ఉండొచ్చు లేకపోవచ్చు గాని ఇలాంటి చిన్న పట్టణానలనుండి రెగ్యులర్ గా రేజర్వేషన్స్ ఉంటాయి . నిన్న నలుగురు నేడు ఆరుగురు రేపు ఎందరో ? అనుకుంటూ ఆ ఆరుగురిని విమానం ఎక్కించాడు పైలెట్ . విమానం ఇంకొంచెం పైకి లేవగానే పెద్ద పట్టణం కనపడింది . " నిన్న ఇక్కడ అరపై మందిని ఎక్కించాను . ఇవాళ ఎందరో ? అని పైలెట్ అనుకుంటూ ఉండగానే " ఇక్కడనుండి పదిహేను మందికి రేజర్వేషన్లు వున్నాయి " అన్నాడు - విమానాన్ని అదే ఎత్తులో ఉంచి ఆ పదిహేను మందిని విమానం లోకి ఎక్కించాడు పైలెట్ గారు . విమానం ఇంకా పైకి లేవగానే మహా పట్టణం కనపడింది . " నిన్న ఇక్కడ 156 మందిని ఎక్కించాను . ఇవాళ ఎందరో " అని పైలెట్ అనుకుంటూ ఉండగానే " ఇక్కడనుండి 218 మందికి రేజర్వేషన్లు వున్నాయి " అని యజమాని అన్నాడు . పైలెట్ విమానాన్ని అదే ఎత్తులో ఉంచి 218 మందిని అందులోకి ఎక్కించాడు.

" ఈ పుష్పక విమానం లో ఎందరెక్కినా ఇంకొకరికి చోటు ఉండటం ఏమిటో గానీ - నా డ్యూటీ ఎప్పటికి అయిపోతుందో నాకు తెలియ కుండా వుంది "అని పైలెట్ తనలో తాను వాపోయాడు .

" ఈ పుష్పక విమానం లోకి ఎందరెక్కినా ఇంకొకరికి చోటు ఎంగిలి ఉండటం ఏమిటో గానీ - - ఈ విమానాన్ని పూర్తిగా నిండిన పాసెంజర్లతో నడిపానన్న సంతృప్తి నాకు లేకుండా పోతున్నది " అనుకున్నాడు విమానానికి యజమాని అయిన యమధర్మ రాజు గారు .ఈ పుష్పక

విమానం గురించి  కిందవాళ్ళకి కలిగే వింత, విచిత్ర , వినోదపు ఊహాలే , నాకు ఈ వృత్తిలో దొరికే సంతోషాలు అని కూడా అనుకున్నాడు యమ ధర్మ రాజు గారు .

హైదరాబాద్ ఎలిబీ నగర్ నుండి విజయవాడ బయలు దేరిన టాక్సీ వాడు - వాడి మనసుకు సంతృప్తి కలిగే టట్లు సీట్లు నిండే దాక  తన టాక్సీని అక్కడక్కడనే  అనేక చుట్లు తిప్పుతాడు .తిప్పీ తిప్పీ  చివరికి పట్టు విడిచి పెడతాడు . యములాయనకి  ఈ సౌలభ్యం కూడా లేదు . విమానంలో ఎప్పుడు చూసినా ఒక్కరికి చోటు ఉండటం అనే విషయం సృష్టి చేయటం ద్వారా,  ఆ అది శక్తి నిరంతరమూ - తన చేత డ్యూటీ చేయిస్తున్నదని యములోరు ఎప్పుడో తెలుసుకున్నారు .నిరంతరమూ డ్యూటీ చేసీ చేసీ  తనకు  కూడా అలసట లో అరవై ఓ వంతు అలసట అనిపించి నపుడు " కొందరు టక్కరి పాసెంజర్లు విమానం ఎక్క కుండా తప్పించుకు పొత్తుతున్నారు అని , పోయి  మేము యముడిని మాయ బుచ్చి వచ్చాము " అని చెప్పుకుంటూ - సరదాలు సంబరాలు చేసుకుంటున్నారని  కూడా యమ రాజు గారు తెలుసు కున్నారు .

" ఎందరు ఎక్కినా గానీ ఇంకొక్కరు ఎక్క టానికి చోటు మిగిల్చే పుష్పక విమానము" వుండటము  యములోరికి - కంటి నిండా   నిద్ర లేకుండా చేస్తున్నది . కానీ అదే పుష్పక విమానము ప్రపంచములో మనకి మాత్రమే  ఉందన్న వూహ   మనలో ని ఎంతమందికో  సంతో షము సంబరము ఆనందము ఆశ్చర్యాలను ఇస్తూ వున్నది .

నేను రాసే ఇలాంటి పోస్టులు చూసి " మీరేమి చేప్ప దలుచుకున్నారు ? అంటూ కొందరుప్రశ్నిస్తూ వున్నారు . నేను చేప్ప దలుచుకున్నది ఏమంటే " యములోరు లక్ష మందిని తన పుష్పక విమానం లో ఎక్కించుకొని పైకి తీసుకో వచ్చాక , అది చూసి అది శక్తీ అమ్మవారు " ఆ

ఒక్క ఖాళీ ఎందుకు అట్టే పెట్టేవు ? అని యములోరి జుట్టు పట్టుకొని ఝాడిస్తూ ఉంటుందని -ఆ ఒక్క ఖాళీ నింపటమే - ఆయన డ్యూటీ / సృష్టి నియమంగా మారిందని --- ఆయనకు అలాంటి సంకట స్థితిని కలుగ చేసి ఒక సృష్టి నియమాన్ని ఏర్పరిచిన పుష్పక విమానము గురించి మనము ఎంతో - సంతోష పడుతున్నాము అని వినోదాత్మకంగా చెప్ప దలుచుకున్నాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క స్వంత రచన

—----------------------------------------------

**4.** అయన అట్లా డిసైడ్ అయి పోయాడు **16 -11 -24**

విద్యా శాఖా మంత్రిగారు ఓ హైస్కూల్ హెడ్ మిస్ట్రెస్ ని తన సచివాలయానికి పిలిపించుకున్నారు - ఎదో ఇంక్వైరీ లో భాగంగా ను .

" ఏమమ్మా భారత దేశము అంటే ఏమిటి ?

"భారత ప్రజలు వుండే ప్రదేశము పేరు భారత దేశము అండీ " అని ఆమె వినమ్రంగా బదులిచ్చింది .

" అట్లా నా ? ఆంధ్ర ప్రదేశ్ అంటే ఏమిటమ్మా ?"

" ఆంధ్రులు ఉన్న ప్రదేశము ము ఆంధ్ర ప్రదేశము అవుతుందండి " అన్నదామె మరింత వినయంగా .

" ఆంధ్ర ప్రదేష్ ని - ఆంధ్ర దేశము అనవచ్చా ?

ఎటు పోయి ఎటు వస్తుందో ? ఎటి అంటే యేటవుతాదో ? ఏమిటో ను ?"

అవును అంటే పోలే - అనుకున్న మేడం గారు " అనవచ్చు నండి - ఆంధ్రదేశము అనవచ్చును . ఎప్పుడో రాజుల కాలంలో ఇండియా అంతా ఏక మొత్తం కాక ముందు - కవులు ఆంధ్రదేశము అనే మాటనే వాడారని మా తెలుగు మాస్టారు అనేవారండి . ఆయనను మించిన గురువు లేడు .అందువలన మనము ఆంధ్ర దేశము అని తప్పక అనవచ్చు నండీ " అన్నది .

" మీ స్కూల్ విద్యార్థులు ఎందరు ?

1600 మంది అండీ అన్నది ఆమె - మంత్రి గారు ఏదన్న అదనపు పోస్టులు మంజూరీ చేస్తా డెమో అని ఆశ పడుతూ . ఉన్న విద్యార్థులు 600 మందే .
" అయితే మీరు రేపటి నుండీ " మన దేశపు విద్య శాఖా మంత్రి- అన్న తరువాత నా పేరు చెప్పి - గారు నిర్ణయించిన సిలబస్ ప్రకారం నేటి పాఠము అంటూ - ఓ ముందు మాటాపలికి , ఆపై మీ పాఠములు మొదలు పెట్టాలమ్మా . అది నా ఆర్డర్ . ఇహ నీ పై ఎంక్వయిరీ నీ కొట్టి వేస్తున్నాము. నీవు వెళ్ళు . కానీ ఈ సంగతి ఆ వారణాసి ఉమా శ్రీరామ కృష్ణ అఫ్ అమరావతి అనే మీ అన్న ఉన్నాడే వాడికి చెప్పకు .అందరికీ లీకు చేస్తాడు .దాంతో విద్యా శాఖ మీద నా పట్టు పోతుంది . దేశ విద్యా శాఖా మంత్రిగా పిల్లల మనసులలోకి చొచ్చుకు పోవాలన్నా నా ఆశకు గండి పడుతుంది . "
"సరే సార్ వెళ్లి వస్తానండి " అన్నది మేడం గారు తబ్బుబ్బిలవుతూ . ఆయనకు కావాల్సిన ప్రశ్నలు ఆయనే అడుక్కుని, సమాధానాలు చెప్పించుకొని ఎంక్వయిరీ కొట్టేసాడు కదా అని మేడం గారు దేశ విద్యా శాఖ మంత్రికి పలు నమస్తేలు చేసింది ,
" ఆగవమ్మా అగు . మీ టీచర్లకు అసలే మతి మరుపెక్కువ . మతి మరుపు పిల్లలని మీరేమి చేస్తారు ?. వారు పాఠము మర్చి పోకుండా ఒకే పాఠాన్ని పధి సార్లు ఇంపోజిషన్ రాసుకు రమ్మని ఆర్డర్ వేస్తారు కదా ? కాబట్టి మీ బు ఆ మూల మీద వున్నా బల్ల మీద పెట్టిన బుక్కులో " మన దేశపు విద్యా శాఖామంత్రి -- -- -- " అంటూ 1600 సార్లు రాయండమ్మా . అంటే ఒక్క విద్యార్థి కోసం ఒక్కో సారి అన్న మాట . ఇహ పొరపాటున కూడా ఈ దేశ విద్యా శాఖా మంత్రి అని నన్ను సంభోదించి ఆపై నాపేరు చెప్పి - ఆపై మీ పాఠము చెప్పటం మీ భాద్యత అని మీరు మర్చి పోకుండా ఉండాలని ఈ ఏర్పాటు చేశానే తప్ప వేరే ఉద్దేశ్యము లేదమ్మా. ఇది మీకు పునిష్ మెంట్ కాదు రికార్డు లలో రాయను .కలకంఠి కంట కన్నీరు ఒలికిన నేను చూడ లేనమ్మా .

అందుకని మధ్య మధ్యలో నావంక చూడకుండా పని కనివ్వండమ్మా ."
అంటూ విద్యా శాఖా మంత్రి గారు
బెల్ నొక్కారు . ప్యూన్ వచ్చాడు ." ఇలాంటిదే ఇంకో ఏంక్వయిరీ ఓ పంతులయ్య గారి పై వుందన్నావు కదూ ? ఇంకో మూలకు ఇంకో బల్ల వేసి దాని మీద పెన్నులు బుక్కులు పెట్టు " అన్నాడు . ఇట్లాగా చేయాలనీ అయన డిసైడ్ అయి పోయిండు మనమేమి చేస్తాము చెప్పండి
,
{ టీచర్ వర్గము - రిటైర్ అయినా టీచబు వర్గము వారు - ఇది వినోదం కోసం నా చే కల్పించి రాయబడిన కథ అని గ్రహించి నా పై కోపం నిప్పులు కక్క కుండా ఉండాలని కోరుతున్నాను . నిప్పులు కక్కితే మన దేశ విద్యా శాఖా గారి వద్ద ఎంక్వయిరీ పెట్టిస్తాను . మీ తుప్పు వదులుతుంది .
ఎదో రకం గా నేటికీ - నాచే ఒకే ఆన్సర్ ముప్పై సార్లు కాపీ రాయించిన పంతులు గార్ల మీద కచ్చి తీర్చుకున్నాను హాం హాం . దీనికి కోపం వచ్చిన అయ్యవార్లు అమ్మవార్లు కోపంలో నైనా నన్ను క్షమించండి .

నువ్వో సగం నేనో సగం
నేడు 12 -11-24 మంగళ వారము . ఆమె ఆధాట్టుగా గుర్తు వచ్చింది . భార్యలు ఉండగా భర్త అంట్లు తోమటం పెద్ద జోక్ కింద రాయబడుతూ ఉంటుంది . ఆమె బ్రతికి వున్నా రోజుల్లో మా పని మనిషి మాని వేసినపుడు అంట్లు ఒక పెద్ద సమస్యగా పోగయ్యేవి . వాటినన్నిటిని ఒక్కోటిగా ఆమె చేతికి అందిస్తూ ఉంటే ఆమె వాటిని తోమి తిరిగి నా చేతికి అందిస్తూ ఉండేది . నేను వాటిని మరల కడిగి ఇంటిలోకి చేరవేస్తూ ఉండేది . నువ్వో సగం నేనో సగం అన్నట్లు ఆమె ప్రవర్తించేది .

నేటికీ నాలుగు రోజులుగా మా పనిమనిషి రావటం లేదు . నేనే అంట్లు బయట పడవేసి తోమి -ఆమె వాటిని అందుకోవాలన్నట్లు పట్టుకున్నాను

. ఆమె కూడా వాటిని అందుకోవాలి అన్నట్లు తన చేయి చాచింది . కానీ గాలి పలికినట్లు పలుకుతూ " నా సగం దగ్గరకు రాకుండా నన్నెవరో కట్టేశారు ." అని బాధతో అన్నది . ఈ లోకంలో తనకు ఉన్న ఈ సగభాగాన్నిగురించి ఆమె మర్చి పోదు. మర్చి పోలేదు అని నేడు రుజువుగా తెలిసింది .

3 పత్తి ఇత్తు - పరంధామం 11 --11 -24

ఒక ఇంజక్షన్ చేయించుకుంటూ వున్నాను.
మొహం లోని ఫీలింగ్స్ కనపడ కుండా మొహం కిందకి వంచుకొని " థాంక్ యూ నర్స్ .. నా చిన్నప్పుడు ఎప్పుడో సుభద్ర అనే నర్సు ఏమాత్రం నెప్పిలేకుండా ఇంజెక్షన్స్ చేసేది . ఆతరువాత నలభై ఏళ్ళకి అంత కమ్మగా ఇంజక్షను చేసింది మీరెను " అన్నాను .
ఆమె ఓ నవ్వునవ్వి " నీ పత్తి ఇత్తు - పరంధామం" కబుర్లు కట్టి పెట్టు. యిందాకా నీకు బీపీ చూసే టప్పుడే నువ్వు నన్ను గుర్తుపట్టావని నాకు తెలిసి పోయింది. నీ పొగడ్త మా బాగానే ఉందిలే రామ కృష్ణా ." అనేసింది .

ఎలాగో ఎప్పుడో తప్పి పోయిన నా చిన్న నాటి నేస్తం "సుభద్ర " నేను ఇప్పుడు ఇలాగ తిరిగి కలుసుకున్నాము .విధి విచిత్రాలు అంటే ఇవేనా ?

ఆమె నర్సుగా జీవితం ప్రారంభించుకొని అనేక క్లినిక్ లలో పని చేస్తూ - ఊళ్ళు మారుతూ - ఒక రెండువేల ఎక్కువ జీతం కోసమని ఈ వూరు వచ్చి -- ఈ క్లినిక్ లో నర్సుగా చేరింది .ఆమెకు ఇప్పుడు వచ్చే జీతం పదిహేను వేలు అని , అది ఎందుకూ చాలటం లేదని, భర్త కూడా పెద్ద

సంపాదనా పరుడు కాదని - ఇంకా జీవితం లో స్థిరపడలేదని ఇట్లా అయితే పెద్ద వయసులో  గడిచేదెట్లా అనే ఆందోళనలో తాను వున్నానని ఆమె చెప్పింది .

అప్పుడు నేను ఎంతో ఉత్సాహంతో " నాకు తెలిసిన పెద్ద హాస్పిటల్ వుంది . దాని లో వ్యాపార భాగస్వామి , దానికి పెద్ద మేనేజరు , దానికి ఆడిటర్ అన్నీ తానే  అయి  వెలుగుతున్న వాడు నాకు ఫ్రెండ్ . నువ్వు వెళ్లి వాడికి కనపడు .నేను చెప్పి నీకు ముప్పై వేలకు తక్కువ కాకుండా జాబు ఇప్పిస్తాను "  అన్నాను .
ఆపై -- ఆమెను ఇంకా కొంత ప్రోత్సహించి " తీరా నీకు వుద్యోగం వచ్చాక " ఈ కార్పొ రేటు హాస్పిటల్ దోపిడీలు నేను చూడలేను . రోగి కళ్ళల్లో ఆనందం చూడటం కన్నా  నాకు వేరే సంపదలు అక్కరలేదు " అంటూ "పత్తి ఇత్తు-- పరంజ్యోతి"  కబుర్లు చెప్పి  చేరిన వెంటనే జాబు మానివేయకు .అనక నాకు మాట వస్తుంది " అనికూడా అన్నాను. . "నీ పత్తి ఇత్తు - పరంధామం " అనే ఆమె ఊత పదానికి - దీటుగా - పోటీగా నేను "పత్తి ఇత్తు-- పరంజ్యోతి" అనే ఊత పదాన్ని  సృష్టించి వదిలాను .అదీ సంగతి .

పెద్ద హాస్పిటల్  కి వెళ్లి అక్కడ ఎవరిని ఎక్కడ కలవాలి- ఆమె కలవబోతూవున్న నా ఫ్రెండ్ మనస్తత్వం ఏమిటి ? ఏ మాటలు చెవిన బడితే వాడు   "పత్తి ఇత్తు - పరమానందం" లాగా ఫీల్ అవుతాడు ?  , వంటి అనేక విషయాలు  ఆమెకి వివరించి చెప్పి   "నన్ను   బట్టి కాక -అతన్ని మెప్పించి జాబులో చేరటం మంచిది - అపుడు నువ్వు క్విక్ గా పైకి పోతావు"   అని  ఓ సలహా కూడా  ఆమెకు పారేసి - ఆమె నా ఫ్రెండ్ వద్దకు పోయేట్లు ఒప్పించాను ..

మూడు రోజుల తరువాత సుభద్ర వాళ్ళ క్లినిక్ దాటుకుంటూ వెడుతూ ఉండగా ఆమె నన్ను కేకేసి పిలిచి "థాంక్స్ రాకీ. వాళ్ళు నాకు జాబు ఇచ్చారు , జీతం నెలకు అరపై వేలు " అన్నది తబ్బిబ్బులు అవుతూ . "ఎంజాబు ఇచ్చారు ?అంత జీతం ఎందుకిస్తున్నారు ?? " అని అడిగాను . ఈ రోజుల్లో ఎవరైనాగానీ నర్సులకు పాతిక - ముప్పై వేలు మించి ఇవ్వటం లేదు కదా అని ఆశ్చర్య పోతూ. అరపై వేల జీతం అనే మాట విని- సంతోషించటానికి బదులు - నేను బోల్డంత ఖంగు తిన్న మాట కూడా నిజమే ను .

ఆమె ఇట్లా అన్నది " మీ ఫ్రెండ్ నన్ను ఎమర్జెన్సీ వార్డులోకి తీసుకెళ్లి - అక్కడి పేషేంట్లను చూపించి " వాళ్ళని చూస్తే నీకేమనిపిస్తోంది ? అని అడిగాడు . అప్పుడు నువ్వు అయన గురించి చెప్పిన "పత్తి ఇత్తు పరంజ్యోతి" కబుర్లు , నువిచ్చిన గయిడెన్సు గుర్తు చేసుకొని " పెద్ద పెద్ద డబ్బు మూటలు మంచాల మీద పడి దొర్లు తున్నట్లు ఉందండి" అన్నాను . దీనికి మీ ఫ్రెండ్ ఫ్రీజ్ అయి పోయి -- ఆపై తమాయించుకొని " ఆ డబ్బు మూటల్లోనుండి డబ్బు తీసి మన హాస్పిటల్ కి జమ కట్టటం నీ పని అని తెలుసునా ? " అని అడిగాడు .
" ఆ తెలుసు . మీరు ఎంత కావాలంటే అంత తీస్తాను " అన్నాను మరింత ఉత్సాహంగా .
"ఎలా తీస్తావు అని అయన మళ్ళీ అడిగాడు . " ఆ ఏముంది ? కొంచెంగా మత్తు ఇచ్చి కాలి వేలు- గోరు మధ్య నుండి రక్తం తీసి టెస్ట్ చేయిస్తాను .ఎన్నడూ ఎవరూ కనీ వినీ ఎరుగని ఈ టెస్టు చూసి -- ఇదేదో చాలా సీరియస్ అండ్ లైఫ్ సేవింగ్ బ్లెడ్ టెస్టు అనుకోని-- ఆ టెస్టుకు రెండు వేలు కట్టాలంటే చాలా ఈజీగా కట్టేస్తారు .. భగవంతుడి దయవల్ల - ప్రతి పేషెంట్ కు ఇరవై వేళ్ళు వున్నాయి . బొటని వేలు బ్లెడ్ టెస్టు కు- చిటికెన వేలు బ్లెడ్ టెస్టుకు - చూపుడు వేలు బ్లెడ్ టెస్టుకు మధ్య ఎన్నో డిఫెరెన్సులు ఉన్నాయని , వేరు వేరు ప్రయో జనాలు ఉన్నాయని

పలికేసి - మనము ప్రతి పేషేంట్ కు రోజుకు 20 బ్లెడ్ టెస్టులు చేయొచ్చు . మీరు ఒప్పుకుంటే ఉదయం సాయంత్రం కూడా చేయొచ్చు . ఉదయం - మధ్యాహ్నం- సాయంత్రం కూడా చేయవచ్చు .ఐ సి యూ వార్డ్ కాబట్టి మనకు ఆ మాత్రం సౌలభ్యం ఉంటుంది . దీనికి మీరు వూ అంటే --ఆ సంచుల్లోని డబ్బు అది అయిపోయేదాకా తీయగలను "అని చేప్పాను . మీ ఫ్రెండ్ "పత్తి ఇత్తు - పరమానందం" గారు ఎంతో హ్యాపీ హ్యాపీ హప్పీ ఫీల్ అయి " యు గాట్ సెలెక్టెడ్ , యు అర్ హెడ్ నర్స్ ఆన్ ఆల్ ది నర్సెస్ అఫ్ ఔర్ హాస్పిటల్ . నీ సాలరీ అరపై వేలు . నువ్వు చెప్పిన ఏ బ్లెడ్ టెస్టునూ కాదనా వద్దని మా డాక్టర్లకు ఆర్డర్ లు వేస్తాను " అన్నాడు . అట్లా నాకు జాబు దాంతో పటు మంచి జాబు వచ్చింది" అని సుభద్ర అన్నది

" నేను నీకిచ్చిన గఇడెన్స్ ఏమిటి ? అందులో ఇది లేదే . నేను చెప్పకుండానే నువ్వు చేసిన ఈ తుంటరి ఆలోచనలు ఏమిటి ? అట్లా ఎందుకు ఆలోచించావు ? అట్లా ఎందుకు చెప్పావు ? అట్లా ఎందుకు చేసావు ? లోకం నన్ను గురించి ఏమను కుంటుందో ఏమో అని వాపోయాను .

ఆమె మా చిన్న తనపు చనువు చేత నా తల మీద మొట్టి " కాస్త ఎక్కువ జీతం డబ్బు నాకు అవసరం కానీ నీకు కాదు కదా ? . నా అవసరం కొద్దీ ఎదో మాట్లాడాను అదేదో సక్సెస్ అయి నెగ్గుకొచ్చాను . ఇందులో నీ కేదో అవుతుందని " పత్తి ఇత్తు - పరంధామం - పరమేశ్వరం " లాగా వర్రీ అవ్వకు . నావెనుక నువ్వు వున్నావని ఏవరికి తెలుస్తుంది ? అన్నది

-------

ఇట్లాంటిది ఏదన్నా మీకు నిజగా ఎదురైై దాని వెనుక నేనే వున్నానని మీకు తట్టి నపుడు మీరు నన్ను తిట్టి సెం చేసిన పాపం పోగొట్టాలని నా విన్నపం .-------

" పత్తి ఇత్తు - పరం జ్యోతి " అనే మాట మా అమ్మాయి లక్ష్మీ శైలజ యొక్క సృష్టి . ఆమె తన బిడ్డలను నవ్వించటానికి ఈ మాట వాడుతూ ఉంటుంది . అది విని నేను

"ఈ మాటను పట్టుకొని ఓ కథ రాస్తాను " అని ఆమెకు మాట ఇచ్చాను . కాబట్టి రాసాను .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి యొక్క సొంత కథ .

at sngm

—------------------------------------------

2. సానుకూల దృక్పదం 02-11-24

అనేక తెలుగు సినిమాలలో చూపిన విధానాన్నే ఫాలో అవుతూ - దిండ్లను నలుపుతూ శోభనం గదిలో కూచో నున్నాడు - అఖిల్ .

ఆ అమ్మాయి ఆన్ టైం వచ్చింది - చేతిలో ఓ ట్రే పట్టుకొని . ఇది రూల్సుకి వ్యతిరేకంగా వుంది అని అబ్బాయి అనుకున్నాడు .దాంతో ఎదో కోపం వచ్చింది . కానీ ఆమె ఇచ్చిన ట్రే ని జాగర్తగా అందుకొని దాన్ని పరిశీలనగా చూసాడు . అందులో వెడల్పాటి మూతి గల బౌల్ ఒకటి , బాగా చల్లగా వున్నా లేదా అప్పుడే ఫ్రిజ్ లోనుండి తీసినట్లున్న టెట్రా మిల్క్ లీటరు పాకెట్ ఒకటి , ఓ పక్క ఓ గుప్పెడు పంచదారా , దాని మీద ఓ నిమ్మకాయ - పక్కన ఓ కత్తెర వున్నాయి .

ఇదే మీ శోభనం? ఇవేమి ఏర్పాట్లు ? ఇదేమి పెళ్ళాము ? అని అబ్బాయి చాలా గా ఫీల్ అయినాడు . ఈ ఆబ్బయికి ఈ పెళ్లి కాక ముందు

అనేకదృక్పధాలు ఉండేవి . ఓ యాభై మందిని ఇతడు , ఓ యాభై మంది ఇతడిని రిజెక్ట్ చేసారు . ఈ క్రమంలో అబ్బాయి యొక్క అన్ని దృక్పదాలు మారి - చివరికి సానుకూల దృక్పధం అనే చోటుకు వచ్చి ఆగాడు , అప్పుడు ఈ పిలను పెళ్లి చేసుకున్నాడు . చివరికి ఈ శోభనం అంతా ఎదో చిక్కుముడి లా తయారైంది . ఇప్పుడు అబ్బాయి తాను అలవర్చుకున్న సానుకూల దృక్పధాన్ని మళ్ళీ శరణు వేడాడు .

అతనికి వున్నా సానుకూల దృక్పధం కొద్దీ ఆ తరువాత అతడు ఇట్లా ఆలోచించాడు . "ఈమె నాకేదో టెస్టు పెడుతూ ఉన్నట్లుంది. ఈ చల్లని పాల పాకెట్ ని కత్తెరతో కట్ చేసి ఆ పాలు బౌల్ లో పోసి , అందులో నిమ్మకాయ పిండి అందులో చెక్కర వేసి, నేను తాగి ఆమెకు తాగించటమో ? లేక ఆమెకు తాగించి నేను తాగటమో ? ఇందులో ఎదో ఒకటి చేయాలి కావచ్చును .ఇది వారి సంప్రదాయం కావచ్చును . శోభనానికి ముందు ఈ పచ్చి పాలు తాగటం ఏంటి ? ఇదేదో సంప్రదాయపు చిట్కా కావచ్చును . నా ఖర్మం కూడా కావచ్చును .ఇదంతా కాక ఈ నిమ్మ కాయ కోయటానికి కత్తి లేదేమిటి ? పాలల్లో పంచదార వేసి కలపటానికి చెంచా లేదేమిటి ?' అని కూడా అనుకోలేదు .ఇంకా --ఈ పిల్ల తీరేమిటి ? ఈమెకు రోజు పాలల్లో నిమ్మకాయ పిండుకొని పంచదార కలుపుకొని తాగే దరిద్రపు అలవాటు ఏమన్నా ఉన్నదా ?ఆ అలవాటు వదులుకోలేక ఇప్పుడు ఇట్లా చేసిందా ? ఇహ ముందు ఆమె ఇలాంటివి తాగుతూ ఉంటే , అలాంటి మూతిని నేను ముద్దిడాలా ?ఆమె కు తోచినట్లు ఆమె చేస్తూ ఉంటే నేను చూస్తూ ఉండాలా ? ఈ ముడి సరుకులు చూస్తూ ఉంటే ఆమె ఏ పనీ కూడా ముట్టు కోకుండా కూచునే రకంగా వుందే ? ఇట్లా అయితే నా జీవితం ఎట్లా ? అని కూడా ఆలోచించ లేదు .పూర్తి సానుకూల దృక్పధమే పట్టుకు కూచున్నాడు .

పరిస్థితుల ప్రభావాన్ని బట్టి - ఎక్కువ టైం వేస్టు చేయకుండా నే - అబ్బాయి - తాను ఆచరించ వలసిన దృక్పథానికి కట్టు బడి పోయాడు . చిరునవ్వుతో కోపాన్ని అణిచి పెట్టు కొని , పాకెట్ ని కట్ చేసి పాలు బౌల్ లో పోసి - నిమ్మ కాయను పళ్లతో కొరికి రెండు ముక్కలు చేసి దాని రసం పాలలో పిండి - అందులో పంచదార వేసి - పాలల్లో చూపుడు వేలు పెట్టి బాగా కలియ పెట్టి పంచదార కరిగించాడు .
అమ్మాయి విచిత్రంగా చూస్తూ వున్నది . అమ్మాయి అనుకున్నది ఇలా కాదేమో? అని అబ్బాయి అనుమాన పడ్డాడు .ముందుగా నిమ్మకాయలో కత్తెరను గుచ్చి ఆ రంధ్రం లోనుండి రసం పంచదార మీదకు పిండి ఆ పంచదారను బౌల్ లో వేసి దాని మీద పాలు పోయాలి గావచ్చును .నేను చేసిన పని నీట్ గా లేదు గాబోలు . ఈ రెండిట్లో ఏదైనా ఒకటే గానీ - రెండూ ఒకటే కాదు కూడా కావచ్చు. ఈ ఆడవాళ్ళతో వేగే విధానం ఏమిటో నాకు తెలియక పోతూ వున్నది అనుకున్నాడు . అనుకుని అమ్మాయి వంకకు తిరిగి " సారీ . ఏదో చేసేసాను" అన్నాడు . " కానీయండి మీ మొగవాళ్ళు ఎట్లా చేసినా అడిగేదెవరు ? మాకు ఏదో సర్దుకు పోక తప్పదు లెండి " అని అమ్మాయి అన్నది . ఏది ఎట్లా చేయాలో చెప్పకుండా - మీరు ఎట్లా చేసినా మాకు సర్దుకు పోకతప్పదు" అనేదే భార్య అంటే .

"శోభనానికి ముందు ఈ పచ్చి పాలు తాగటం ఏంటి ? ఇదేదో సంప్రదాయపు చిట్కా కావచ్చును " అనుకుంటూ అబ్బాయి ఆ పాల బౌలు అమ్మాయి నోటికి తాకించి ఇంకో వేపు తన నోటికి తాకించుకొని - మనసులో పాల పట్ల డీప్ గా వికారం ఫీల్ అవుతూ . " హౌ రొమాంటికు యు ఆర్ " అన్నాడు . తనకు ఇష్టం లేని పని చేస్తూ కూడా , దాన్ని రొమాంటిక్ గా ఫీల్ అవుతూ వున్నాడు అని చెప్పే వాడే భర్త అంటేనూ .

.

"భార్య  మనస్సులో ఏటుందో-- తాను తెలుసుకోలేననే  దృక్పధం" ఏదెట్లా వున్నా గామీ భార్యను వుబ్బిస్తూ ఉండాలన్న దృక్పధం  అబ్బాయికి మొదటి రాత్రే పట్టుబడింది  - కాబట్టి వీడి కాపురానికి  ఢోకా లేదు - అని పైనున్న దేవతలు సంతోషించారు .
 "పచ్చి పాలు చచ్చినా తాగలేము" అని మొదట అనుకున్న ఆ అబ్బాయే ఇప్పుడు  ఊదుకుంటూ వూదుకుంటూ ఆ పాలు తాగసాగాడు .
అతడు ఊదినపుడల్లా మరి కొన్ని పాలు తనవైపు కు ఎక్కువ గా వస్తున్నట్లు , ఫీల్ అయిన అమ్మాయి " ఆయనకే అక్కర్లేనివి నాకు మాత్రం ఎందుకు ?నేను మాత్రం తాగుతానా? ఇట్లా అయితే ఈయనతో కష్టం"అనుకుంటూ   భార్యలకు సహజమైన  దృక్పధాన్ని ఎంచుకున్నది.

పురుషులందరికీ  సానుకూల దృక్పదం - స్త్రీలందరికీ తమదైన  స్వంత దృక్పధం ఉండాలని దేముని శాసనము అనుకుందాము  .  స్త్రీల దృక్పధం ఏమిటో పురుషులకు అర్ధం కాదు .మీకు  అర్ధం అయి ఉంటే ఈ పిల్ల శోభనం గదిలోకి నిమ్మకాయలు ఎందుకు తెచ్చిందో   చెప్పండి చూద్దాము  .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి సొంత కథ
.------------------------------------------
1.జరగాల్సింది ఎదో జరగాలి 28-10-24

ఆమె పేరు పిచ్చెమ్మ గారు . భర్తలు తమకు బాగా ప్రేమ ఎక్కువైనప్పుడు " అదుత్త పిచ్చిది " అంటూ వుంటారు కదా ?  ఈమె భర్త  అలా అనుకున్నపుడు తన కున్న కోట్లాది రూపాయల ఆస్తి పిచ్చెమ్మ గారి పేరున రాసి - అది తన మనుమ సంతానానికి చెందాలని విల్లు రాసి

పోయాడు . మరిప్పుడు పిచ్చెమ్మగారంటే ఉట్టి పిచ్చెమ్మ గారు కాదు పిచ్చిది కూడా కాదు . గొప్ప కోటీశ్వరురాలు .

పిచ్చెమ్మ గారు ఒక కోటి రూపాయల నగదు తెచ్చి బీరువాలో పెట్టుకుంది . మనుమడో - మనుమరాలో వచ్చి " నానమ్మా అదిగో ఆ రోడ్డుమీద పోతూ ఉందే ఆలాంటి కారు కొని పెట్టు " అని అడిగితే - ఎదో చాకోలెట్ కొనిచ్చినంత సింప్లెగా ఓ కారు కొనాలన్నా కోరికతో ఆమె ఆ డబ్బు ఆలా ఉంచుకుంది . ఇప్పుడు లేనిదంతా మనుమడు మనుమరాలే.

పిచ్చెమ్మ గారి అబ్బాయి రాత్రి రొండింటి దాకా కంప్యూటర్ ముందు గడిపి అప్పుడు బెడ్ రూమ్లోకి పోతాడు . కోడలు ఇంకొంచం నయం .పెందరాడే అంటే ఫదో గంట కల్లా పడుకుని - భర్త ఇటు బెడ్ రూమ్ లోకి వచ్చిన అతి కొద్ది సమయం లోపే , అతనికి దొరికే విశ్రాంతిని భగ్నం చేయటం ఇష్టం లేని దానిలాగా --బయటికొచ్చి తల స్నానాలు చేసి దేముళ్ళని మేల్కొల్పి- ఎనిమిదింటికల్లా ఆఫీసుకు బయలు దేరి వెళ్లి పోతుంది . కోడలు చేసిన టిఫిన్ లోకి చెట్నీ చేసి - తొమ్మిదింటికి కొడుకును నిద్రలేపి అతనికి పెట్టటం పిచ్చెమ్మ గారు చేయాల్సిన పని .
పై ప్రకారం చూస్తే " జరగాల్సింది ఎదో జరగటం లేదని - అందుకనే మనుమ సంతాన ప్రాప్తి కలగటం లేదు " పిచ్చెమ్మ గారికి ఊహకు అందింది .
గ్రహాలు ఏమైనా అడ్డం పడుతున్నావా అని అలోచించి , ఓ నవగ్రహ మండపానికి వెళ్లి గ్రహాలకు తాయెత్తులు కట్టించింది . ఇలాంటి ప్రయత్నాలు ఎన్నో జరిగాక పిచ్చెమ్మ గారు ఒక ఎక్స్పర్ట్ ను సంప్రదించారు .
అయన లక్ష రూపాయల వెలలో పిచ్చెమ్మ గారికి ఓ కుక్క నిచ్చారు . ఇది సాధారణం కుక్క కాదు . దంపతుల మధ్య జరగాల్సింది జరిగిందా లేదా

అని తేల్చి చెప్పగల కుక్క . దంపతుల మధ్య జరగాల్సింది జరక్క పోతే ఈ కుక్క ఊరుకోదు . బెడ్ రూమ్ లో నుంచి వారు బయటికి రాకుండా అరిచి నానా యాగీ చేస్తుంది . వారి మీదకు ఎగిరి దూకి - వారిని కింద పడేసి - వారు ఆఫీస్ లకు వెళ్లకుండా చూసి వాళ్ళ లీవ్ లు పేస్టు చేయిస్తుంది . ఇరుగు పొరుగు వారు పోగై ఏంటి సంగతి అని అడిగి - నవ్వు కుంటూ పోయే దాకా కుక్క అలాగే చేస్తూ ఉన్నేట్లు దానికి తర్ఫీదు ఇచ్చారు .

పిచ్చెమ్మ గారి కొడుకు , కోడలు వరుసగా ఓ వారము రోజుల పాటు కుక్క బారిన పడ్డారు . వారు ఎంతో థింక్ చేసి ఇట్లా తేల్చారు . " ఏ ఐ ప్రకారం ఆలోచిస్తే -కుక్క మనం వేసుకున్న బట్టలను వాసన చూసి మన మధ్య జరగాల్సింది జరిగిందో లేదో తెలుసు కుంటున్నట్లుంది . అంటే నా శరీరపు వాసన నీ బట్టల మీదా , నీ శరీరపు వాసన నా బట్టల మీద లేక పోతే అన్నమాట . అందుకని మనం ఈవెనింగ్ ఆఫీస్ నుండి రాగానే విడిచిన బట్టలను బాగా మిక్స్ చేసి మన బెడ్డు రూమ్ లో నే ఒక కుప్పగా వేద్దాము . మర్నాడు పొద్దున్న ఆవే బట్టలే వేసుకొని బెడ్ రూమ్ లో నుండి బయటికి వద్దాము . ఇలాగా మన బట్టలలో ని చెమట సెంటు ఒక దానికి ఒకటి కలుసుకు పోతాయి . మనము ఈజీగా కుక్కను తప్పించుకొని బయట పడొచ్చు .దీంతో మనమధ్య . జరగాల్సింది ఎదో జరిగింది అనుకుని కుక్క బోల్తా పడుతుంది . మనము చక్కగా ఆఫీసులకు పోదాము-- పనిలో దూరదాము ."

చాలా మంది భార్య భర్తల మధ్య జరగాల్సింది ఎదో జరగటం లేదని ఈ మధ్య అనేక మంది మానసిక శాస్త్ర వేత్తలు మొత్తుకుంటూ వున్నారు . "ఆఫీసు ఆఫీసు - పని పని" అనే ఆలోచన వాళ్ళ మెదడులను ఆక్రమించుకొని ఉండటం దీనికి ఒక ముఖ్య కారణమని వారే చెప్పారు . ఇప్పుడు నేను చెప్పగలిగింది ఏమిటి అంటే " వారి మధ్య జరగాల్సింది

ఎదో జరక్క పొయినా - జరిగింది  అని పించేట్లు చేసి వారు కుక్క ను
బోల్తా కొట్టించగలిగారు  -  అని .

వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ యొక్క స్వంత రచన .